# నాంది.

4.

శా. సృష్టిన్ వ్యష్టిఘటిల్లెగాని జగమే నేకంబ మున్నవ్యక్త-సం
తుష్టిన్ పొగ్వదు నాను భేదలేశ మెందున్ గానరో యందుమా
శ్లిష్టత్వంబు నెపంబుగా బ్రకృతితో క్షీరోదకన్యాయము
తత్కృష్టప్రేమన యుంచుశంభుడు కృపాదృష్టిన్ మనస్సుం బ్రోవుతన్.

సీ. ఏసుమహేశ్వరుని విశ్వేశ్వరత్వంబొప్పు నణ్వాద్యజాండపర్యంతశిష్టి
నేపని విశ్వగురుత్వమింపొందు నేకహార్ద తనాపిపీలికా బ్రహ్మముగను
గణుతింపలేననేకబ్రహ్మకల్పసంచితబుద్ధు లెవని సుస్థిరమహత్త్వ
మేవిశ్వభూతాత్మ కైవల్యపదవితో విహరించును జగత్ప్రవృత్తులెల్ల

తే. నిత్యుడై నిర్వికారుడై నెగడు నెవడు
తనయభివ్యక్తియే జగద్వ్యక్తిగాగ
దాను నిర్గుణవిశ్వతత్త్వంబెగాగ-
నానిరాశ్రయు భగవంతు నాశ్రయింతు.

శ్రీరస్తు.

# స్వర్ణచూతము.

## నారాయణ.

### ప్రథమాంకము - ప్రథమరంగము



(కుంతలదేశరాజధానియగు భామతీనగరమందు కోటకెదుటి రాజవీధి - కాలము ప్రాతఃకాలము. ఇద్దరు పౌరులు దోవతులు, అంగరఖాలు, తెలుగుదేశపుతలపాగాలును ధరించి ప్రవేశింతురు. ఇటునటు పురజనులు వచ్చుచు పోవుచునుందురు. కోటలోపలి నుండి మంగళధ్వనులు వినబడును. కోటదేవిడీ అలంకరింపబడియుండును.)

ప్రథమపౌరుడు:—ఓ——!!! రేపు పాటికి చూడాలి వివాహం వైభవం. నేనున్నంతమట్టుకు రెండుమూడు తరాలకిటీవల యింత మహోత్సవం రాజనగరులో జరిగియుండ లేదు.

ద్వితీయపౌరుడు:—నిజమే - సమరసింహమహారాజు మేనత్తగారి వివాహం అయినతరువాత కోటలో శుభాలేం జరిగాయి? అప్పటి సంగతి నేనెరగను. చెప్పగా వినడమే. కాని మనప్రభువువారు వైభవంలోనైతేనేమి సద్గుణాలలోనైతేనేమి తాతతండ్రులకు వెనకదీయరు. రేపటిశుభలగ్నానికేదో నూతనవిధాన రాజ్యమంతా ప్రజలందరికీ సంపూర్ణప్రీతిదాయకమయేటట్టేర్పాట్లు జరుగుతూన్నాయట!

ప్ర. పౌ.—ఆఁ, నీవేమి విన్నావు? నన్నడుగు — నేటికి పదిహేనురోజులనుంచి రాజకార్యనిర్వాహకులకు నిద్రాహారాలు లేవు. రేపటిదినం సామ్రాజ్యం అంతా "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అన్నట్టు ఒక్కటే హృదయం ప్రవర్తిల్లాలి యట. ఏయే శాస్త్రశిల్పాదివిద్యలభ్యసించినవారో యా విద్యలు తమతమ గ్రామాల్లో ప్రదర్శించాలియట. అందుకు బహుమతులు యిచ్చేందుకు ప్రకారానికన్న పదిరెట్లు రాజకీయోద్యోగస్థులు అప్పటికప్పుడు పంచిపెట్టడం అట - దేవాలయాల్లో అభిషేకాలూ లక్షపత్రిపూజలూ, భోగాలూగా - రాజ్యమందంతా ఆకాశదీపాలు - సత్తరువుల్లోనూ సాలల్లోనూ అష్టైశ్వర్యాలతో సంతర్పణాలట - నాటకాలట, పాటలట, గరిడీసాములట, బొమ్మలాటలు, కోలాటాలు—ఓరి బాబూ!!

ద్వి-పౌ:—రాజు ప్రజలందరికీ అంతరంగం అయినపుడు ప్రజానురంజకుడైన రాజే రాజు. స్వార్థపరాయణుడైన రాజు పట్టిపేరుకే. ఇంతకన్న సమయమేది— కౌమారైవివాహంకన్నా–జగద్విఖ్యాతమైన ప్రభువుల ప్రజాజనకత్వము వెల్ల డించుటకు? కాని యింత నిరంకుశప్రభుత్వం వున్నందుకు శ్రీవారి ప్రజానురక్తి యోగ్యతా వేనోళ్ల కొనియాడదగినవి. నిగర్వచూడామణిగదా-

ప్ర-పౌ:—పండితసభలట, శాస్త్రచర్చలట, విలువిద్యలు, ఇపతల చిత్రవస్తుప్రదర్శ నాలు, ప్రతిపల్లెలోనూ పువ్వులపాలకీల్లో వుంచి వధూవరులపటాలు నృత్యగీత వాద్యాల్తో ఊరేగించడం అట-తమసామ్రాజ్యంలో ప్రతియిల్లు పెళ్లియిల్లే-ప్రతిగృహస్థుడూ పెళ్లిపెద్దే రేపు-

ద్వి-పౌ:—చబాష్-చబాష్-ప్రభువులచక్రవర్తిత్వానికింతకన్న దృష్టాంతరం మరొకటుండిగనకనా! న్యాయంచేత ప్రజకూ ప్రభువుకూ గలసంబంధం జీవాత్మల సంబంధం వంటిది.

ప్ర-పౌ:—రాజధానియందు వేడుకలు విన్నావా? ఆకపుగాన్నది నక్షత్రశాల. దాని పాండిదీ ఆకాశపురంగుది. దానిలో అక్కడక్కడ సద్వృత్తులనక్షత్రరాసులు చిత్రించి యందు చక్కని మినుకుదీపాలుంచి వాటివెలుగున రాత్రిసమస్త బంధుసామంతప్రభువులకు విందు జరుగును. నేనాచిత్రకారుణ్ణి లోబరచుకొని పోయి చూచివచ్చాను. గోడలమీద ప్రభువులదిగ్విజయాంకాలు–ప్రభువువారు కూర్చుండేగద్దెని స్వేతచ్ఛత్రం వకటి. దానినధిష్ఠించి చల్లని వెండిబంగారపు మెరుగురంగుల్తో సహస్రకరములుగల్గి ప్రకాశించు సూర్యబింబం-వధూవరుల శిరస్సులపైని శరత్కాలధావళధళ్యముతో రోహిణీశశాంకులు-దిగువున రత్నాలే నివాసీలుగా కట్టడప్పని-గోడలప్రక్క నొకవస్తువ వెయ్యివస్తువులుగా కనిపించేటట్లు పెద్దనిల్వుటద్దాలు – ఆదీపాలువెలుగుతూంటే ఆసావిడి వొకప్రపంచంలాగ కనిపించింది.

ద్వి-పౌ:—అయితే యిదంతా మనం చూద్దాం యేలాగ లక్షకోటిజనంలో!

ప్ర-పౌ:—రాత్రి వూరేగింపు-సామ్రాజ్యసేనలా సిద్ధం- అశ్వగజోష్ట్ర పదాతిసైన్యాలు కుంతలాధీశ్వరులసమస్తబిరుదాంకాలతో ముందు నడవడం-ఇవి గాక బాణాసంచాలు నూటయిరవై సానాయి మేళాలు వచ్చి యున్నాయట-యెనభైఆరు భోగంమేళాలు సమంతటతాము విన్నపం జేసుకొని పైగా లంచాలిచ్చినవి కొన్నిన్నీ, సామంతరాజులు కానుకగా పంపినకొన్నిన్నీ-

ద్వి-పా:—నీకింతధికారం పట్టియాక అంతపనికేం భాగ్యం-నీవు తలుచుకుంటేనే అ యిపోతుంది-చల్లని ప్రభువువు.

(కోటబురుజునుండి ఫిరంగి వినబడును.)

గు:—(తుళ్లిపడి) అదుగో, నే పోతానంటే పోనిస్వరు-ధారాపురీమహారాజులుంగారు వేంచేసినారు. వారిని విడిదిలో ప్రవేశపెట్టమని శ్రీవారి శలవు అయింది. నన్ను స్వయంగా పిలిపించి "మోహనరావూ, మోహనరావూ,నీవిప్పటివాడవుకావు, నీతాతలు మాతాతల దగ్గర ఉద్యోగాలు చేశారు, నీమీద రాణివాసం వారికీ కూడా ప్రేమ్తే, యీపెళ్లినాలుగురోజులు యెంతచెకచెక లాడిస్తావో సుమా, నీబుద్ధికుశలత అంతా వుపయోగించి, యేలోపాలూ రానియ్యకూడదు సుమా" అని స్వయం శలవిచ్చినారు. అవతల ఆపనే చూసుకోనా, యివతల వచ్చిన చుట్టాలూ సామంతులూ అందరికీ ఔషధా పేయిస్తునా, ఊరేగిశరపకుండా రత్నపర్తకులు కుదిపించే ఆభరణాలనర్ధానికి లెఖ్ఖలు వ్రాయించడమా, ఉలాకులు వేయించడమూ,ద్రవ్యాధికారి సొమ్ముచీట్లుయివ్వడమా,-అబ్బబ్బ,యీపెళ్ళి నాప్రాణం పుచ్చుకోడానికొచ్చిందిగాని!! యేం అయినా, నమ్మకంగా పనిచేయడం అంతప్రాణాంతకం మరోహాటి లేదు. చేసినవాళ్ళే కట్టుకు సాగలీస్తారు. చేయ్యనివాళ్లూ, సమయం దొరికితే దోచుకునేవాళ్లూ నెత్తిమీద దేవతలే-ఇస్సు!! (అని చెంతనున్న వేపమ్రానినానుకొని నిలువబడును.)

(ఆస్థానపౌరాణికుడు ప్రవేశించును.)

గు:—(ముందుకువచ్చి) నమోనమః, శాస్త్రులుగారు (నిష్క్రమించును.)

పౌరులిర్వురును-నమోనమః-నమోనమః-

పౌరా:—ప్రాతర్నమామి - ఓయి బాబూ! యీయెత్తినరెక్క వాల్చేయోగం లేదు కాబోలు నాకు. అంతా నాకే వందాలెత్తురు గదా. నన్నేపట్టు క్కాల్చుకు తింటారు! కొసకి నాకు చేతనైంది యేమీ లేదు గుడ్డిగవ్వంతైనా. కట్నాలూ కానుకలూ వశిష్టుగారివీ, సిద్ధాంతిగారివిన్నీ-యీమహోత్సవం అంతా వారికే కామధేనువుపాడి పదిమంది చుట్టాలకిప్పించినా తాము తిన్నా! నాకేం వుంది అవిధేకాని? తెల్లారగట్ట చుక్క వాలకండా లేస్తాను. స్నానం, సంధ్యా బ్రహ్మయజ్ఞం, పితృతర్పణం, సహస్రగాయత్రి, గీతాపారాయణా, దేవతార్చనా అయి, వాకిట్లోకొచ్చేలోగా, అంచీలమీద అంచీలు ప్రభువ్వారివద్ద నుంచీ పట్టమాదేవిగారివద్దనుంచీ గంజీకానిడిపట్టి యనుకింకరుల్లాగ లాక్కుపో

కారు. యెవరాజ్ఞ మన్నించకపోతే వారికే కోపం-ప్రాకారంలో అడుగుపెట్టి టప్పటికి చిట్టితల్లెమ్మగారి మెదలోనుంచి కబురూ. పక్కమాటు చూసి మళ్లీ బాబయ్యగారిసన్నిధికెళ్ళమని. పోనీ వాహచోటుంచుతారా? ఓరోందుగుర్రాలబండి మీదో, నోకెండి అంబారీయేనుగుమీదో కూలేసి అమహారాజు దగ్గరకెళ్ళా, యీమహారాణిదగ్గరికెళ్ళా, అక్కడ జాతకం రాయీ, యిక్కడ ధర్మశాస్త్రం చెప్పా,—దింతో సరిపోతూందా? నాదినం అంతా తెల్లవారిలేది అపుడే పదిరాజబసలోకెళ్ళి పని చూసుకొచ్చా. అదేం పాదో కాని మా ప్రభు వారికి యేచుట్టం వచ్చినా యేసామంతుడొచ్చినా యిమిగో మూర్ఖ యెంతటిదిగ్గజం వున్నాడో చూడమని నన్నూ, నాప్రశంసావ ప్రభు భాగోతపుతోలాగ వూరేగించి యిలాగా అలాగా తిప్పుతారు. లౌక్యాల్ నేనే, రాయబారాలకీ నేనే, సిద్ధాంతాలకీ నేనే శాస్త్రార్థాలకీ నేనే. అబ్బబ్బబ్బ! యిలాగ సుఖ్యతే అనిష్టపడకపోరానికి అగ్రహారాలు వ్రాయించి పుచ్చుకోనేవిద్వాంసులెవ్వరూ యింముకు పనికి రారు. మేడలు కట్టించుకోడానికీ వ్యాపారాలు చేసుకోడానికే గాని-

ప్ర-పా —ఔనండీ. మీయంతవారు మీపాదినగా కొందరు గదా-అయిన్నీ మీకు సాయం ఉంచుకొసి సభుంపని అయినకిప్పుగించరాదటండీ? యెందుకని మీరు-?

పూరా —ఆఁ యెందుకని? యెందుకని? నాకు నూరేళ్లున్నాయనుకున్నావా, నూటయాభై యనుకున్నావా, రాబోయ్యే మాఘసప్తమికి యెనభై రండి. మానాన్నగారు తొంభైయెనిమిదేళ్లు బతికియూరు. మాపెద్దంద్రుగారు నూటఅగు-మావాడికేం తెలుసును కెట్లైపాడగట్టు! నాశాస్త్రం వందా, నాఅనుభూతుందా వాడికి? మొన్ననోమాటు ప్రభువ్వారిమూంగగారు "చిన్నశాస్త్రుల్లు, యీవాళ ప్రవణిఉపాకర్మ చేసుకున్నావయ్యా," అని అడిగేటప్పటికి బతిసుందగానే ఫపాకర్మంవిలని చాబు చెప్పేడు. ఆమాట వాతో చెప్పి నవాణ్ణాలో అందరూ పక్కలు లేక ట్టుట్టు నవ్వేయూరు హుఁ! హుఁ! హుఁ!

ద్వి-పా:—ఏం అయినా మీకొసిక్క చాలను సక్కకక్కశాస్త్రంలో మీకే చాలరట కాదూ మీకొమారుడికి-చిన్నవాడైతేనేం?

పూరా:—వాడిమొహం కామూ! యీమధ్య నోచిత్రకథ జరిగింది చెప్పకేం? వాకొడుకైతే సరియా? కొడుకయ్యేది వాడిఅబ్బయచ్చిదిభయభక్తులువిడపసివ్వకుండదు. యింట్లో కూచుని పంకీకొక్కలాగ ... తక దివాణం అంతా వొక్కమాటు కొపాసనపడదాం అని యేం పన్నాగం పన్నియాడో యెవణ్ణి అశ్రయిం

చాడో వాహనాడు తిన్నగా ప్రభుసన్నిధానం చేరి ప్రతాపంఅంతా వినిపించేయడం ఆరంభించియాడు. యీసంగతి నాకోకోటబంట్రోతు వచ్చి చెవులో పూదియాడు. నాకు తెలియకుండా కోటలోకి వొక్కచీమ చిటుక్కుమని రాలడమే? హేం! యీమాట వినీవినడంలో పిడుగులాగ సన్నిధికెళ్ళి నిలబడ్డాను. మావాడిగుండె లెండిపోయాయి, నన్ను చూడ్డం తోటే. యింతట్లో నాలుగు శ్లోకాలు కాలామృతంలోంచి చదివి అర్థంచెప్పమ నేప్పటికి కిందిగుడ్లుమీదికేసి నానిక్కుదపలేక పోయాడు. మహారాజు నాకోనూటపదహారూ వాడికో అర్ధనూటపదహారూ యిచ్చేటప్పటికి రొమ్ముతగిల్చిచ్చి యివీఅవీలాక్కున్నా. ఏదీ చెప్పమనండి చూతాం. యీరాజ్యం యావత్తూ తిరగాబోర్లావేసి తెప్పించండీ- అనుభవం యెక్కడతెస్తారయ్యా-యేశాస్త్రానికీ శాస్త్రం నోయిస్తే అనుభవం యిరవై యెత్తులూ-అసలు నేచదువుకునేటప్పుడే గురువుగారికి యెదురుతిరిగి పాఠం చెప్పేవాణ్ణి-సుమేరుమహారాజులుంగారు దండయాత్రకు వేంచేసేటప్పుడు జాతకం తెప్పించి ప్రమాస్థితి అడిగేరు. అసలు ఆజాతకం నేనే రాశాను. స్వామీ, దిగ్విజయంచేసుకొస్తారు తప్పదన్నాను- నేవేసినగ్రహాలే కావాయే మీభయంలేదు నే పూచీపడతానన్నాను.

(కాల్బలము ప్రవేశించును. లోపల వాద్యములు) (పౌరులు నిష్క్రమింతురు)
(కొంతసేపటికి అందఱు నిష్క్రమింతురు.)

---

## ప్రథమాంకము - ద్వితీయరంగము.

---

(అమరావతీపురమందు సమరప్రియుమేడలోని కచేరీసావడి. నేలకు పట్టైన యెఱ్ఱరంగుగల మెత్తనిరత్నకంబళములు పరచిచిత్రములైన రంగురేకలు గలయెఱ్ఱ గలుపలు, పలుగులతలతో చిత్రింపబడియుండును. నడుమ బంగారుమయమైన పెద్ద యెఱ్ఱని దీపపుగాజుకలశములు బంగారుగొలుసులకు గట్టి యూగుచుండును. గోడలపై పెద్దడాళ్లు, తలవార్లు, విల్లంబులు, శూలములు బల్లెములులోనగు శ్రీకరాయుధములమర్చి యుండును. మధ్యమధ్యను పెద్దవి, చిన్నవియగు యుద్ధవీరులయు, శార్దూలగజసింహముల వేటాడుపోటుబొమ్మలయు, పటాలములయు మల్లయుద్ధములయు చిత్తరువులును, నిల్వుటద్దాలును, వానిపైన పూర్వరూపవర్ణములు గల పూలదండలు ఆకుతోరణములును, దిగువ జలతారుబుటాలు గల యెఱ్ఱకీన్కాబు కుట్టినసోఫాలును, పువ్వులు నేసిన

స్వ:—సఖీ, మహారాష్ట్ర, సమరప్రియా—నీశత్రువులు పశ్చాత్తప్తులై నీశరణుజొచ్చినారని విన్నవించుట నీయఖండగౌరవప్రాభవములకు బ్రోద్బలకమే కాదా? అట్టివారిని మన్నింపుమని వేడరాదా?

స:—రాదు రాదు-తొలుదొల్త దుర్బుద్ధిపుట్టకే పోవలయు. పుట్టినది పశ్చాత్తాపమువలన నివారితమగునా? పట్టుబడనున్నప్పుడు పశ్చాత్తాపము. చేతగానప్పుడు శరణాగతి. అంతే గాని యొక్కనాటికి నైజదుశ్శీలము వదలిపోదు. అదియటుండంగాక,

వలనుగలయప్పుడెల్ల నెవ్వగలబెట్టి
యెట్టో విధమరి యడుగుల బట్టుమాత్ర
బగతు సేవరుటొకనాటిపాటు నమ్మి
కదలియిసుకల సౌధంబు గట్టినట్టె.

శత్రువులను జయించి, ఖండించి, నాయధికారమును నిష్కంటకము గావించి కొనుసామర్థ్యము గలిగియుండి, యట్టివెదవులబంటి శరణాగతితో సంతుష్టినొంద నేల? అప్రతిష్ఠకన్ననిది యెక్కువా, అంతకన్న నెక్కుడు సుఖమా?

స్వ:—అన్ని నేరములకు నొకటే యురిశిక్షా? జయించుటయు, లయించుటయు దామస లక్షణములు. శరణార్థి నాదరించుట నీదేవత్వమునకు లక్షణము. భయమూలమగు నధికారముకన్న సౌహార్దమూలమగునది యెక్కువగట్టియు శ్రేయస్కరమును. సుంత నోరు జారినంత యుద్ధసన్నాహము జేయుట బుద్ధిదౌర్బల్యము. లోకమంతయు దనపైయుద్ధసన్నద్ధమగునటు లనుమానపడి చిత్తశాంతి బోగొట్టుకొనుటేమిప్రయోజకత్వము? ఇంతకును,

తన్ను దా నమ్మి యొరుల చిత్తమ్ములందు
మెలగనేర్చి జగత్కుటుంబిగ రహించు-
దొసగు గల్గిన నరము, యసమానంబు,
కీర్తి, యశాంతి, దాన లోపించు సుఖము.

మఱియును,

భూతములకెల్ల నైజమదై నమైత్రి
కృత్రిమము లంతరములు యాదృచ్ఛికములు-
ప్రియమయినపథ్య మోరిమి, ప్రేమపెంచు
సేవము, చలంబు నెదిరి దస్నేర్చి పుచ్చు-

కావున నన్నివిధముల నీయట్టి మహాపరాక్రమమేధాశాలిని కలాశత్రుత్వము రాణించి నీకును జగత్తునకును క్షేమబీజమగుంగాని, యీర్ష్యయు దీర్ఘక్రోధమును సమంజసములు కావు.

స:—నీరు పోయి నిప్పును వేడినదట—నీ వేడిమాని నావంటి చల్లనితల్లివై లోకము బాలింపుమని. హా! హా!! హా!!! నిప్పు ప్రత్యుత్తరమిచ్చినదట: నీవు నావలె వేడితల్లివైతే నీవంటి చల్లనితల్లిని నేనగుదునని- ఇట్టి హితబోధ నీకును, దాని నిరాకరించుట నాకును మనచిన్నతనమునుండియుం జరుగుచున్న ప్రక్రియయే మనస్వభావములను మనము మార్పగలిగితిమా! అది యట్లుండనీ - లోకస్వభావమే మైన మార్పగలవా? నాయెడ లోకమునకుం గలుగు నీర్ష్యయు నసూయయు మాన్పింపగలవేని లోకము నెడ నోరిమియుం బ్రీతియు నేజూపుట కేదేశక్యము-

స్వ — నేనెప్పుడేమిచెప్పినను నీవు ప్రేమచే వైరులను వశపరచుకొమ్మని నామతము. నీ నిష్కపటనిస్సంశయక్రియముచే లోకవిక్రియము జయింపుమని నాసిద్ధాంతము.

అహితదౌర్జన్యదావాగ్ని నార్పవైచు
ప్రేమ చలిలేటి బొంగించు ప్రేమవృష్టి
విశ్వవిజితదివ్యబిరుదంబు వినుము ప్రేమ
దాన నిహమందె యీశ్వరత్వంబు నొందు.

స:—సన్యాసుల కుపదేశింపు మామహామంత్రము. అట్టియుత్కృష్టక్రియము నాకు మిగులకుండ నసమర్థులు ననాథులు గాని చూరగొందురు గాక-నాకట్టివ్యాపారమునందు విశ్వాసమును లేదు; ఆగత్యమును లేదు.

నన్ను గొల్వనివాడు నావాడు కాడు
నన్ను నమ్మనివాడు నాయగ్గులాడు
నన్నెఱుంగనివాడు తన్నె మెఱుగు'
మనసు దప్పన్న నెమ్మదిమాట సున్న-
వికటించెనా జన్మ వెగటు తోపింతు
పంతగించెనయేని ప్రాణంబు గొందు
దౌర్జన్య బదునాల్గులోకము లేడ్పింతు
బ్రతిమాలినకొలంది బగ రెచ్చు నాకు
నెరనమ్ముకొలది క్షీణించు నాకగుణ
చలమునాబిరుదు వజ్రము గోలుగుండె

మోదిరికన్నీరు నాహృదయసంజీవి-
లోకమంతయు నాకు వాకింటిబంటు
నామతంబుదురాయి నాకమంతటను
నాపెట్టినదె భిక్ష నరలోకమందు-
నేనేమరినగాని నిలదు సఖ్యంబు:
కన్ను విప్పితినేని గగ్గోలువడును
రాజులు, రాజ్యముల్, రాజ్యాంగములును-
జనకులు సుతులతోఁ జలపట్టినపుడు
సతిపతులు పోట్లగతి బోరినపుడు
విభుడు లోకుల బట్టి వేటాడినపుడు
స్వామిసేవకు బట్టి చక్కాడినపుడు
తలపుము నాసూత్రధారిహస్తంబు
తెలియనిహేతువై తిరుగుటాలోన;—
నే నిందుకొలువుండి నిఖిలైకవిధిగ
లీలకై భూమి బాలింతునం చెలుగు
నాకు ధర్మవ్యాధి నాట దేనాడు
చెప్పి యత్నించి వంచింతు ధర్మంబు
ప్రాణిహింసకు మించి పాతకం బెలుగ
సాధుల బనిపట్టి బాధింతు—వారి
బాధించుదుష్టుల బాధింతు మగిడి-
పాలిపు చనువెంట బ్రాణముల్ బీల్తు
కన్నకొన్నును విందుగా మెక్కనేర్తు
ప్రణమిల్లునను రక్తభక్తుపై కురికి
గర్జించి తున్కలుగా గోయనేర్తు.

స్వ:—ప్రాణప్రియా, క్షమింపుము. నీకధికారము లేదని కాదు. అధికారమును బంగారు నకు గనికరము కొత్తావి. అధికారపుదీపమే యనుక్రోశము.

న:—నీకును నీభర్తకును ప్రభుత్వానుభూతియన్నది లేక కావ్యలోకమే లోకమని మిటి పడి మీయంతటిలోకజ్ఞులు లేరని దుష్పాండిత్యము-నాకు బలమున్నది కాగా గర్వము-విద్య కలదు కావున కేవము-అధికారములో బాటహంకారము. మీకేము

న్నది. ఏమి పోగలదు. మీరు నా యహంకారము సహింపలేని, పోనీ నాయౌన్నత్య మొకింతచవిచూతురు గాక. కాచుకొండి, సమరప్రియదోస్స్తంభము దేవలోకమంతటి పొడవు, పాతాళమంతటి బలువు. (లేచి విజృంభించి గదతోడ బాహువు జాడి ఝళిపించును)

అఖిలాండభర్త లోకాధినాథుండు
విమతకాలుడు లోకవిజయశీలుండు
నాతండ్రి పద్రికిన్నను మేటి యోధుడు
నేనింత విసిగినట్లైన నివ్వెర
గద్దియతో బాటు కంపంబు నొందు-
సింధువిరుంచి వేళ్ళాగ్ని
మాయన్న సమరాదిమ ధ్వాంతలక్ష్మి
వెలుగొను నేగియు గిరిని దాటి పడును:-

(దౌవారికుడు ప్రవేశించును.)

దౌ—లోకనాయకీ, సుమంత్రుడు భవత్సాపసందర్శనమునకై త్వరపడుచు ద్వారమునొద్ద వేచియున్నాడు.

స—రమ్మను. (దౌవారికుడు నిష్క్రమించును.)

(సుమంత్రుడను చారుడు ప్రవేశించును.)

చా—జయ జయ మహాదేవ దేవేశ్వరీ! నిరంకుశప్రభావ ప్రతిమాధురంధరీ! అఖండలోకైశ్వర్యాభిమాన మహాత్మా! ప్రణమితసమస్తస్తోత్రాకా! జోహారు, జోహారు.
(ప్రణమిల్లును.)

స—ఏమి నీపని?

చా—రాజ్ఞీమతల్లీ, దుష్టనిగ్రహార్థమై, భగవత్సిద్ధయోగమున నవసించియున్న యిచిన వారు యేర్పడిసి సమస్తప్రజయు, భక్తులును, సేవకులును ముల్లోకములందును కుశలము.

స—నీవరయిచ్చిన కార్యమేమి?

చా—మహాదేవీ, దేవరవారి యఖండరాజ్యలక్ష్మీ భవాతిశయప్రతిష్ఠ జగమంతయును సువర్ణముగా నిండియున్నది.

స—నీ వెందుండి వచ్చితివి?

చా:—లోకశాసకీ, యేలినవారిపంపున భూలోకమందంతటను దిరుగువాడనై సకలదేశ
ములయందును సుస్థిరముగా నెలకొన్న యేలికల ప్రతాపము లారసి మెచ్చుకొనుచు
నిన్నటిప్రాతఃకాలమున కుంతలదేశాధీశుడగు విజయసేనమహారాజుదర్బారునందు
నరులకదృశ్యుడనై విడిసితిని.

స:—ఏమి యందలి వింతలు?

చా:—విజయసేనుని కొమరితయగు భద్రాదేవికి రేపటియుదయమున నఖండవైభవ
ముతో నుద్వాహము కానైయున్నది. అందులకు శ్రీ యేలినవారిజననీజనకులు సుమే
ధాప్రోజ్జ్వలా ప్రముఖపరివారసహితముగా వేంచేయనున్నారు. నరలోకమందీవర
కమర్త్యులు నిజసుప్రసన్నాకృతితో నెన్నడు నవతరించియుండలేదని విజయసే
నుడు తన కనాదిమిత్రుడైన వజ్రదేవునకుం గలిగిన యపూర్వసుప్రసాదమునకు
దన్మయత్వము నొంది తానును సమస్తప్రజయుం గలిసి నిద్రాహారముల మరచి
కేలుగల్గు పాటుపడి యాభామతీనగరమును స్వర్గపురినిం బురణించువిలాసముతో
నలంకరించియున్నారు.

స:—ఏపాటిపురణించునో చూతునుగదా—నాకాహ్వానమిప్పుడో యికనో వచ్చును.
ఏమి యూరకున్నావు?

చా:—చెపిన్నమాట యమరావతిలోనే యదో కుట్ర జరిగినదని.

స:—ఏమి నాయెడనా?

చా:—చిత్తము. కటాక్షించి యాకర్ణింప వేడెద. నాయనగారిదర్బారుపరివారమం
తయు సబంధుమిత్రభృత్యముగా పేరుపేరువరుసను ఆహూతులుకాగా, దేవ
లాసూయచే నిచ్చటనే యేలికలకంపిన శుభలేఖ మాయచేసినారని వింటిని.

స:—ఆఁ! నాయనగారింతఘోరకృత్యమున కీయకొనిరా? ఇంతకుం గతమేమై యుం
డును?

చా:—చిచ్చి-త్త-త్తం.

స:—చెప్పు.

చా:—(సాలోచనముగా) ఏలినవారి నిరవధికరూపమహిమాప్రావీణ్యములును నిరంకుశ
ప్రాభవమును, సర్వశ్రేణీకవస్వాతంత్ర్యమే కతము.

పొరుగుపచ్చికి దానెందు, నోరునిసుఖము-
తనకుపద్రవ, మొరుపి యుద్ధతియె వ్యాధి,

"వెలదియరణంబు" హా! హా! హా! "వెలది యరగణము మోసంపు వెలవు"— మామంచి మాటాడినావమ్మా! యనుచు ధిక్కరించు నీ దేహాభిమానము నే మెత్తునా, బృహస్పతికి వంకలు దిద్దు నీకుశాగ్రబుద్ధియే మెత్తునా? వెలదులందఱు నొకయెత్తు; శచీ వెలదిమిన్నవగు నీవొక్కరితవు నొకయెత్తు! పదునాల్గుభువనములను గడగడ వడకించి పాదాక్రాంతములుగా జేసికొనగలుగు వరము నీకే యిచ్చి తక్కటి వెలందులందఱను నీదాయలుగా నుండుడని శాసింపబోలు నా బ్రహ్మ! ఏది యేమైననేమి? నేనీక్షణమున కీగండము గడచి గట్టెక్కినాను. చెప్పరాదు-చెప్పకుండరాదు - ప్రభువులు చారచక్షులనుమాటయే కవితాచాతుర్యమనుకొంటిని. మామహాదేవికి సహస్రాక్షుడును వాచస్పతియును గలిసిన యొక్కమహాపురుషునందుమాత్రము ఫాలచక్షువు ప్రసరింపదు. అదియును అటుండనిమ్ము-తల్లికెట్టి "మోసంపు వెలవు" తోచెనో రేపు కన్నార జూచుభాగ్యమునకై నేడు బ్రదికితిని. (నిష్క్రమించును.)

---

## ప్రథమాంకము - తృతీయరంగము.

---

(విజయసేనమహారాజు నుద్యానవనము.)

కాలము రాత్రి-(పూర్ణిచంద్రికాభాసమునందొగిన పుష్పఫలభరితములైన మనోజ్ఞతరులతాకుంజములు నల్గడంగలిగి రత్నఖచితమై ప్రదీపాలంకృతమగు దివ్యభవనము.

ప్రక్చందనహారాలంకృతులై కేయూరకిరీటాది రాజచిహ్నాధరులై ప్రసన్నముఖులై నృపతియు హీరాదేవియుం నిరుప్రక్కల సుమేధాప్రజ్వలలు నున్నతాసీనులై ప్రవేశింతురు. కొంచెము దిగువను నుచితాసనములపై విజయసేనుడును దత్పట్టమహిషియుం, పసపుబట్టలును కర్పూరపుదండలను ధరించి నవవధూవరులును గూర్చుందురు. హీరాదేవిముస్తాబు - అతిభారముగల జలతారు అంచులు, మైజారు, పెద్దపుష్పాలు గల యూదాకీన్కాబు చీరెయు దానికిసరైన జలతారుమయమై రత్నఖచితమగునంచులు గల రవికయుం-శిరసున రత్నఖచితమగు కిరీటము-మణిమయమగు హారకంకణాద్యాభరణములు-చేత నొకబంగారురాజదండమును-వైఖరి సర్వత్రణీకరాధికారదర్పము.

సుమేధ సుమాంగల్యమును దెలుపుటకుమాత్రము తగినయాభరణములును, వస్త్రములు ధరించును. సన్ననిజలతారు అంచును, మైజారును గల లేతగన్నెరురంగు చీరెయుం

బిక్కగా శరీరమును గప్పు సాదాపసుపురంగురవికయు ముంజేతులకు మూడునాలుగు జతల వజ్రపుతాపడముగల బంగారుగాజులును,రవికచేతులను బట్టియుంచుటకు భుజములకు వజ్రపువంకీలును, మెడకు సన్ననిపలకసరులు, సన్ననిచంద్రహారములు, తెల్లనిపుష్ప హారములును, కాళ్లకు బంగారు మువ్వలుగలపట్టీలు, మట్టెలు, చెవులకు వజ్రపుదమ్మెట్లు, జూముకాలును, ముక్కునకు వజ్రపుటడ్డబాసయు, వజ్రపునత్తును, కలకలమను ముఖమునకు తీర్చిదిద్దిన పెద్దకుంకుమబొట్టు, శిరసునకు సూర్యచంద్రులు, కురులందు తెల్లమల్లెపువ్వులగుత్తి, వైఖరి దీర్ఘదృష్టియు గాంభీర్యమును, జ్ఞానసంపత్తియు, యశోచితమందహాసముగల ప్రసన్నతయును-ముగ్ధత్వమును.

ప్రోజ్వల లోకమంతటిని మోహింపజేయువన్నికతో వస్త్రాభరణములు ధరించినట్లగపడవలెను. ముగ్గురు దేవకన్యలలోను సౌందర్యవతియు, సౌందర్యగర్వితయు, ఆత్మసంతుష్టయు, సాహసకర్త్రియు, వలపుకర్త్రియు, విస్ఫుటస్మితభాషితయు,అంతరంగమును తళుక్కుమనిపింపదలంచినమాటలు, చేష్టలును, అలంకారములును ధనప్రధానముగాక కేవల రసప్రధానముగా జేసినముస్తాబు. మంకెనపువ్వురంగు జలతారుగళ్లు నిగనిగమను చీరెకు దళమైన జలతారుపువ్వులఅంచును, చక్కనిజలతారుమైజారును, ఊదా మొహమాలు రవికకు దండలయొద్ద జాలు, జలతారు అంచును, కుట్టునొద్ద ఖడ్డీజలతారుబొద్దును, గులాబిపువ్వులమాలికలు పేర్చివిగాక విలువై తళుకుగలరత్నములు స్థాపించినహాగ కంకణాదులు సన్ననిబొట్టు-కురులు కెరటముల పెత్తుపలముగా దువ్వి పెద్దజడముడి వేసి రొజ్జిగులాబీపువ్వులగుత్తితో నలంకరింపబడియుండును. చెవులకు వజ్రపు జూముకాలు.)

చోప్దార్లు లోనగు పరివారము-చోప్దార్ కేక...మహారాజాధిరాజ, పరగండభైరవ, రాజమార్తాండ, కుంతలాదిమహామహేంద్ర విజయసేనాధినాథ... (నాట్యము- సంపూర్ణాలంకృతలై యువతీజనము నాట్యనైపుణ్యము జూపుదురు.)

పాట—

(పసుపుబట్టలు, అంగరఖాలు, శిరోవేష్టములును ధరించిన గాయకబృందములో గొందఱు)·—

వసరమను మాధవుడు వలచెను వలచె రోహిణి నల శశాంకుడు
కమ్మతెమ్మెర దవిలి గువ్వలు కపలుగూడి భవంబు వలచెను-
పచ్చవిలుతునిపండువమరిచెః బ్రక్కతకీసలయసుమవిలాసత;—
శుభవధూవరులార సమయము శ్రుతియు స్వరమయి మేళవింపగ.

మఱికొందరు:—

ప్రాణపదముగ బెంచితిమి మాభాగ్యమింతేటి కిదియె మూలము
ఒరులసొత్తని యన్నమాత్రన నుల్లమున బల్లెమయి తోచెను—
ఎందుదాగితి వెట్లు వెలసితి విపుడు తొలకరి మెరుపువిధమున?—
ఎంతజాణవు. మాధనంబు హరించి విమ్మలరింతు వింతగ! !

(నటీగాయకులు నిష్క్రమింతురు)

వి:—వైభవాగ్రమందించె దైవంబునుగ్ర
—హంబుమై భాగ్యరాజ్యగోత్రాభివృద్ధి;
నైన ధన్యతనొంద దైన్యంబు బాయ
నీలతను బట్టి కొమ్మకందించు వఱకు.—

2. నేడుగా కనుల్ చల్లనై నిల్చె దాల్మి!
స్వాంతకలహంస సమ్మోదసరసిఁ దేలె:
కులములో వన్నె మేటి రాకొమరు డిచ్చె

(పెండ్లికొడుకు వైపున జూపించుచు)

నీసురలసుప్రసన్నత యిహముఁ బరము

(గంధర్వులవైపున జూపుచు)

వ:—సత్యసంధుడ వతిమానుషప్రభావ
ధైర్యతేజోవిభాసిని ధర్మభుజుఁడ
వేరి నీసాటి మనుజేశ యిందునందు?
బేదవడుదువు వినయంబు పేర్మి గాని!
సు:—అన్యులమె యిట్లు కొనియాడ నకట మమ్ము?
భద్ర మన యింటిపడచు తత్పరిణయమ్ము
పరమభాగ్యంబు మాకు సంపత్కరంబు
ప్రో:—కాగనే పూని కూర్తు మీఘనుని దీని!
హి:—కాగనే కల్మిపట్టి నాకడిది జెట్టి

(వధూవరుల సిద్ధనిని రెండుచేతుల గూడదీసికొని)

కూర్మినెఱిచేపువచ్చె గైకొనుడి వరము:
నిత్యసౌభాగ్యసంపత్తి నిరతరక్తి,

సు:—ఆర్యధర్మతనుత్ర మెసట్టిసుతులు
వ:—చారుకీర్తి యఖండాస్మ గౌరవంబు
ప్రో:—సారభోగంబు పూర్ణ వాంఛాఫలంబు.

(అందఱును వధూవరులపై నక్షతలు చల్లుదురు.)

(ఆకాశవీధినుండి దేదీప్యమాన తేజస్సుగల యొక చూతఫలము బంగారువికారమై రత్నఖచితమైన యక్షరములతో మెల్లగా దిగి సభవారియెదుటనున్న యొక చంద్రకాంతశిలాఫలకముగలబల్లపై నిలుచును అందఱును లేచి యద్భుతపడి యొకరిపై నొకరుమూగి చూతురు ఒకరినొకరు మూచుకొని యాకాశమువంక పరికించి మాటాడనేర కాశ్చర్యోపసనిమగ్నులై యుండ గొంతతడవుండి వజ్రి యాఫలము గేలగొని కూర్చుండి పరిశీలనాచూచును. సురకాంత లొక్కొ రొకరు చేతులు చాచి యందుకొనజూతురు. వజ్రి యెవరిచేతికి నియ్యక తానే యిటునటు త్రిప్పుచు శోధించి శోధంచి విజయసేనునిచేతికిచ్చి యొకరినొకరు సాలోచనముగా జూచుకొందురు.)

భ:— నాయనగారూ, నాయందనుగ్రహించి యిష్టదైవతము నిచ్చినవరములకు సద్యః ఫలమే యిదిగా దోచుచున్నది. ఇది మనకత్యంతమంగళప్రదము- ఏదీ చూచె దను. (చేయిచాచును.)

వి:— కుమారీ, యిది ఫలముకాదు—బంధము. వరముకాదు—వైరము. నీకు గాని మరెవ్వరికిగాని యిచ్చుటకు నేజాలను. ఉచితజ్ఞశిఖామణియగు సురశేఖ రునికిం జెల్లునేమో-(వజ్రిదెస జేతులు చూపుచు)

వ:— నాకుం జెల్లదు- చెల్లదు.

హీ:—ఏమి యట్లంటిరి ప్రాణనాథా? మీకు జెల్లనిదొకటి గలదా ముల్లోకము లందును?

వి:— హిరా ; స్వశక్తిచే సాధించికొనగలిగిన దీమహాఫలము. వినయముతో వేడదగి నది కాదు. ప్రేమచే బెట్టదగినది కాదు- (ఫలమును వ్రేళ్లపై ద్రిప్పి చదువుచు) ఇది "భువనమోహినికి" అని నిర్దిష్టమగుటను సామంతముచేగొన్నకొనగలిగినది- (మనుష్యకాంతలు విన్నబోదురు సురకాంతలొక్క పెట్టునలేచి "ఏది" "ఏది" యని వేగిరపడుచు నొకరినొకరు త్రోసికొని చేతులు చాపుదురు. వజ్రి భద్ర ముగా ఫలమును మరల బల్లపై నుంచును)-

హి:—(ఫలము తొందరగా గేలగొని) "భు-వ-న-మో-హి-ని-కి" (సాలోచనముగా బల్లపై నుంచుచు) ప్రాణేశ్వరా!

సు:—(ఫలము చేత నొడిసిపట్టి, ముద్దిడి) ఆశ్చర్యము నభినయించుచు) "భు-వ-న-మో-హి-ని-కి" (బల్లపై నుంచుచు) నాయనగారూ, ఇది యేకాంతామణిపుణ్యఫలమో గదా!

ప్ర:—(ఫలము గేలగొని, కన్నుల నద్దికొని ఱెప్పలల్లార్చి మెచ్చికొనుచు) "భు-వ-న-మో-హి-ని-కి" (ధైర్యముతో బల్లపై నుంచును) నాయనగారూ! ఏమి యద్భుతరూపసౌరభములండీ!

వ:—సతీపుత్రికలారా, నాసమక్షమందిది రాకుండిన నే నెంతధన్యుడను! దైవోద్దిష్టమెట్లున్నదో యెవ్వరు నిర్ణయింపగలరు?

హి:—స్వామీ, మీకన్న దైవమెవ్వరు? మీయాజ్ఞ కడ్డమేమి? దేవరచిత్తానుసారముగా నిర్ణయించి మాలో మీకిష్టులైనవారికీ మహాసమ్మాన మనుగ్రహింపుడు. మీరు నిర్ణయించుటే దైవము.

వ:—ఇచ్చట నేశాసకుడను గాను. నాకియ్యెడ నధికారము లేదు. చతురంత మహీమండలమును బాలించుచు అనంతజీవరాసులకు గుశలనిర్ణేతయగు విజయసేన మహారాజునాజ్ఞ కియ్యెడ మనమందరము బద్ధులము.

వి:—దేవేశ్వరా, నేదగనిభారము నాపై బెట్టకుము. దేవతలవివాదలు నేనా తీర్పసమర్థుడను? నాకట్టియధికారము దేవర కల్పించిరేని దాని నిదేవదులుకొనుచున్నాను. (సకుటుంబముగా నిష్క్రమించును.)

హి:—ప్రాణనాథా, మీరే నిర్ణయింపుడు-మీప్రియధర్మపత్ని మనవిని మన్నింపుడు-(ప్రతిమాలును.)

సు:—మూడులోకములకు శ్రీరామరక్షయగు దేవరవారి న్యాయశీలముతో నిర్ణయించిన మాకందఱకును సమ్మతమే. మీదోర్దండము నాశ్రయించినగదా ధర్మదేవత సమస్తలోకాశ్రయయై వన్నెకెక్కెను!

ప్ర:—సుమేధా, భువనమోహిని యెవ్వరో వారి కియ్యుడీ. ఇక్కడనే కాదు- త్రిభువనములయం దెచ్చట నున్నను-

వ.—ప్రోజ్జ్వలా! ఇచ్చట నున్నవారికే యీపందెము లేకున్న ఫల మిచ్చుట వ్రాలుటేల?

కు:—బుద్ధ్యదప్రాయమై కేవలేంద్రియామోదకమైన దేహసౌందర్యము పాటింపకుడు. లోకోద్ధారకమైన మనోబుద్ధులసౌందర్యమే సౌందర్యము.

హి:—మనోబుద్ధులు లోకోద్ధారమందు వినియోగింపగలుగు ప్రాభవముం బాటింపుడు. ప్రభుత్వము నాశ్రయింపని ప్రతిభ కేవలస్వప్నవైభవమువంటిది. అడవిని వెలుగొందు వెన్నెల కెప్పుడో సౌధము నిర్మించినప్పుడుగదా సార్థక్యము?

ప్రో:—ఇది కేవలశారీరసౌందర్యమునకై యేర్పడినది. తక్కటి యోగ్యతలతో బనిలేదు.

హి:—ఆ యేర్పరచినవానిమనస్సున బ్రవేశించి చూచినట్టు మాటాడుచున్నావు! శారీరసౌందర్యమన్న నీకు లభించునా, లేకున్న లేదా?

ప్రో:—కేవలప్రభుత్వమన్నచో నీకు లభించునా? నీవన్న ప్రభుత్వమే సంకల్పమయ్యేనేని నట్లువక్కాణింపడా?

హి:—ప్రాణవల్లభా, నన్ను దూలనాడుచున్నవి. మానప్రాణములకు మిమ్మాశ్రయించిన నాతిరస్కృతిని విని యెట్లు సహింతురు?

సు:—తుచ్ఛకామోద్దీపకమైన పట్టి పైనెయుంగున కింతమహాఫలము సమ్మానము కానేరదు.

ప్రో:—దైవమునకు బుద్ధి జెప్పుదువో? "మహాఫలము" కామోద్దీపకమును మాత్సర్యమూలమును కాలేదా? మహాఫలంపు "పైమెయుంగు" మహాదేవేశ్వరులట్టివారికి లోభనీయమైనపుడు సమస్తసృష్టికి నవతంసపుష్పమనందగు నవనవయౌవనోజ్వలకాంతాసంహననసౌందర్యమే తుచ్ఛకామోద్దీపకమయ్యెనా? వహ్వారె! యేమి మాటలాడుచున్నావు!

వ:—సురవధూరత్నములారా, నాకు మీరు చెప్పబనిలేదు. అందఱకును గావలసినది న్యాయము. నే న్యాయము దప్పను. నాయెఱింగినకొలదిని దప్పనియ్యను.

ప్రభువు గమ్మని శాసించి పంపువేళ
బ్రహ్మ కనె జీవు "డక్కటా ప్రజసహాస్ర
శిరములన్నగంబు దాని రంజింతు నెట్లు?—
చెల్లనో తండ్రి నన్ను రక్షించి విడుము."

2\. అనుడు బరమేష్ఠి నాశాప మక్షయంబు
కాని కనికర మొదవె, మోక్షణము జెపుదు:
స్వార్థ మెడనెట్టు న్యాయదేవత భజింపు—
కానిచో నిన్ బ్రభుత్వమ్ము గాసి పుచ్చు!!

స్వాభిమానావేశముచే ధర్మము దిరస్కరించు ప్రభువు ప్రభుత్వానర్హుడై నగుబాట్లనొంది చేటొందును. ఏ ప్రభువు తానే ధర్మమూర్తియని గర్వించునో వానిపై సమస్తభూతములు చలపట్టును. ధర్మదేవతయైన ప్రభువు భగవంతు డొక్కడే. అస్మదాదులము తత్ప్రవర్తకులమే కాని తత్స్వరూపులము కాము. మాకు ధర్మకల్పనాశక్తి యొంతమాత్రమును లేదు.

హీ:—అదిగో శ్రీరంగసీతులాడి నన్ను విన్నబుచ్చుచున్నారు. ఈయంటని ముట్టని మాటలతోనే నన్నింతసాటివారిలో జాకచేసినారు. అయ్యో ప్రేమలేనిదాంపత్య మెటు రేణికెక్కును? గంధర్వలోకాధీశ్వరియైన మాయర్థాంగి యింతకన్న నెక్కువసమ్మానమునకు నోచుకొనలేదా ?

సు:—అమ్మా, న్యాయముచొప్పున బరిష్కరింతుమని ప్రభువు లానతిచ్చినారు. నీకు న్యాయము కావలెనా, వట్టి యుత్కర్ష కావలెనా? నీవును ప్రభుత్వపదవి నలంకరించిన మహారాజ్ఞివే కదా !

సు:—వయసువచ్చినదాదిగా హృదయమందు మగవానికి జోటియ్యక, ఆశలు, పాశలు కడుపులోనే జీర్ణించుకొని యొంటెత్తు బ్రతుకు బ్రతుకుచున్న నీవేమెఱుంగుదువు మగనివలన నిరాకరింపబడిన యిల్లాలియిడుమలు?

సు:—తల్లీ నాగర్భశత్రువులకు వద్దాయిడుమలు. నీవు పెండ్లాడి నీవేమి సుఖపడినావు? భర్తనేమి సుఖపెట్టినావు?

ప:—అమ్మాయీ, సుమేధా! ఇంతవరకు నాచేత నెన్నడును జెప్పించికొన్నదానవు కావు. నీకు దెలియనిధర్మములు జగత్తున లేవు.

హీ:—అబ్బబ్బ! పెండ్లాముగౌరవము మంటగలిపినదాని నంతంతకతనోక్తులాడ నెట్లు నోరాడినది? ఔను, నేనొకభార్యను, అది యొకభార్యకూతురు. నావంటి భార్యలను సురలందున, నరులందున గూడ నసంఖ్యాకముగా మోహించి యొక్కచో ప్రేమనిలకడలేని ప్రభువువలన న్యాయ మెట్లు చేకూరగలదు? నా దౌర్భాగ్యమును నిందించికొనవలెను. మిమ్ముల ననవలసినపని యేమి?

ప్రొ:—అమ్మా, శాంతింపుము. గంధర్వలోకమంతటిని శాసించి త్రిజగత్ప్రఖ్యాతిపాత్రులైన నాయనగారు మనకు సంతుష్టిజేయకుందురా? అందుకు శక్తిచాలదా, ప్రేమచాలదా ?

హీ:—నాకాపురము నీవు దిద్దగలవా? ఇంద్రియోపభోగమే జన్మపరమావధిగా నౌచిత్యము నేలపాల్చేసి, కామమోహాంధతచే ప్రత్యక్షముగా నొకమర్త్యుని వివాహమాడిన వలపులాడివి. నీవును నీతిచెప్పుటయే ?

ప్రో:—అధికారదుష్పాండిత్యముచే లోకమంతటిని తృణప్రాయముగా జూచి, యంత జగజ్జెట్టియైన భర్త నొకపురుగుగా నేరిపారవెయ్యగలుగు మహాతేజశ్శాలినివగు నీకు నీతిజెప్పగలవారు ముల్లోకములను లేరు ఎవరు నోరుమెదిపితే వారి పైనే కత్తిగట్టుచున్నావు. నీగొప్ప యేమిటమ్మా! నీయంతటివారము మేమును-

హీ:—నాయంతటివారు మీరొక్కనాటికి కారు. నాభర్త నన్ను నిరాకరించినారు గనుక మీవంటియల్పులందఱకును నాతో సామ్యము దెచ్చికొనుటకు వీలైనది.

సు:—నీయంతటివారము మేము గాము- మాయంతటిదానవు నీవు కావు (ముగ్గురును లేచి, చేతులు చాచుకొని కలహింతురు.)

(ఈసందడిలో సమరప్రియ రంగమునందే పాత్రములకు వెనుక నిల్చి పాత్రముల కదృశ్యయై, యీతంత్రమంతటికిని దానే హేతువగుట నలువురకు దెలియునటుల వెంకితనపు సంతోషముతో నవ్వుచు, వెక్కిరించుచు గనపడును.)

వ:—(లేచి వారించుచు) దైవతములారా, మనము భూలోకమునకు వచ్చి పని యైనది. విజయసేనుని వీడ్కొని యికపోదము. తరువాయిపని రాజధానినుండి యేర్పరుప నుంకించినాను.

(అందఱు నిష్క్రమింతురు. వజ్రి స్వప్నచాపము కేల గొని)

---

శ్రీరస్తు.

# స్వర్ణచూతము.

## ద్వితీయాంకము - ప్రథమరంగము.



(వింధ్యపర్వతపుకనుమలు-సెలయేటినీరు ధారగా దల్లక్రిందుగా బాఱుచు పైనుండి నురుగుగట్టి చుట్టుప్రక్కల నతిదూరమువఱకు దుంపరలు చెదరునట్లు పెద్దఱాతిపై బడు చోటు- దిగువ బ్రవహించునదియొడ్డును మహోన్నతవృక్షములు మేర లేక బలసిన యరణ్యము. కొండప్రక్కలను పుష్పఫలభరితములై యెల్లెడలను దరుశాఖలు వ్యాపించును. ఒకచరియపై మహావిపులముగా వ్యాపించిన కదంబవృక్షచ్ఛాయను పుష్పసహస్రములచే జిత్రాసనముగా నేయబడిన మెత్తని పచ్చికపట్టు- అందొకఱాతిపై గూరుచుండి ప్రక్కనున్న మఱియొకఱాతి జేరబడి, సగము పరుండి సగము కూర్చున్నట్లు ప్రియదర్శనుడు ప్రవేశించును. చేతిలో నొక చక్కని బంగారు కట్టునున్న పట్టుదారమునకు గట్టిన పిగిలిపిట్ట- మఱియొక చేత విరివియైన తెల్లనిబొచ్చుగలలేతగొఱ్ఱెపిల్లను శిరస్సు దువ్వి గారవించుచుండును.

ముస్తాబు:—పాదములనుండి మోకాళ్లవఱకును శరీరమా బట్టయా యని శంక పుట్టించుపలచని మేజోడు- పాదములకు బంగారుపువ్వులు నేసిన పలచని యూదా మొఖమాలు చడావు జోడు- మోకాళ్లకు కొంచెము దిగి బంగారు జలతారుపువ్వులతో దీర్చిన రెండంగుళములయంచు గల తెల్లని మోహమాలుషరాయి. నడుము దిగి యొంటి నంటి యెదుట ముత్యములయు వజ్రములయు గట్టిదపుపనిగల వెస్టుకోటు. అందుపైని బిరుదులకు దిగి యెదుట మూయక తెఱచియున్న రత్నఖచితమైన యంచులును భుజములపైని ముంజేతులపైని వెన్నుపైని దట్టమైన జలతారు మిన్నాపనిగల నల్లమొఖమాలు కోటు.

మణిహారములు- వజ్రపుబటములు- చెవులకు మనోహరములైన వజ్రపుతమ్మెట్లు- మూపువఱకును వ్రేలాడునుంగరపుగిరజాజుట్టుపై నూదా మొహమాలు జలతారుటోపీ- అందుపై హంసతూలికలయు రత్నములయు శాఖలుగల కలికితురాయి- నల్లని మెత్తని నూగుమీసము- వయసు 22 సంవత్సరములు- తెల్లగులాబీపువ్వువన్నెగల తనుచ్ఛాయ-

అత్యంతమనోహరమూర్తి- కాలము వసంతమధ్యాహ్నము. వెన్నెలకాంతిగలిగి యంత తన్న దీక్ష్ణముగానియెండ.

తెర యెత్తిన కొంతసేపటివరకు పైని జెప్పినట్లు పరుండి, కాలిపై గాలు వేసుకొని యూడించుచు, ఒకమాఱు గొల్లెపిల్లను మఱియొకమాఱు పిట్టను ముద్దాడుచు, నిమురుచు, ఈలగొట్టుచు, కొంత మద్యపానవికారమువలన పరధ్యానముగా నున్నట్లి టునటు చూడక తన్మయమై యుండి, కొంతసేపటికి లేచి నడచుచు, నేపైపునకుం జూడక తనలోదాను కూనురాగము దీయుచు, ఆలోచించుచు)

ప్రి:—పాట-

సూనశరుసి వింట దొడిగి। చూపుటమ్ము వేసి నాదు।
మానసమ్ము గ్రుచ్చి యట్టి। మరులుగొలిపి మరలనీని॥
దానిమనసు కొల్లగొనక। తక్కుటటి మగతనంబు॥
కలనుగన్నవిధము తోచె। గలికినీటుగతులగోటు॥
అలరుదావులొలికె మేన। నొర కలిమికిరవు నొసలు॥ దాని॥

(విష్ణుభట్టు ప్రవేశించి, కొంతసేపు నిలిచి, విని, పరికించును.)

ఓహోహో! రావోయి రత్నాలకోవా! రావోయి రంగధామా! నీవు పట్టి విష్ణుభట్టు వనుకొన్నా నింతవఱకునూ. నీవు త్రిమూర్త్యవూను, పదారువేల గోపికా స్త్రీలూ, ముప్పైమూడుకోట్ల దేవతలూ నీలో అంతర్భూతములే - సప్తమహర్షులూ, అష్టదిక్పాలకులూ, నవగ్రహాలూ నీకు చాలరు.

వి:—చాలరు, చాలరు. నీవు మదనవేదనాపారవశ్యమం దున్నావని, ప్రియదర్శనా, నీప్రియదర్శనము కాగానే గ్రహించును. నన్నేమో నీప్రాణనాయకిగా భ్రమ పడ్డావు. మొగవాణ్ణి కొనియాడి లాభమేమిటి?

ప్రి:—రావోయి నవనీతచోరా! (బెత్తముతో బరధ్యానముగా జోడు వాయించు కొనును)

వి:—నేను చోరీచేసిన నవనీతం అంతా నీకే నైవేద్యం పెట్టానుగా?

ప్రి:—రావోయి రాజహంసా!

వి:—రావోయి రాజముఖి! రావోయి రత్నగర్భుడా!

ప్రి:—హా! హ్హా! హ్హా! హ్హా...! బాగా గుర్తిపాడిచావు! కాని వారంరోజు లాయె రాజముఖి నానేత్రచకోరము లలరించి- నీకేమైనా కనబడిందా?

వి:—కనబడింది. నిన్ను చాలాచాలా అడిగింది. నీవు రసికశిఖామణివని ప్రశంసించింది. అభినవమనోభవుడవట నీవు! సంగీతసముద్రానవట! నిన్ను చూస్తే

అచేతనాలకు కూడా పాట పుట్టుకొస్తుందట! నీపాటే వింటే రాళ్లు కరుగుతాయట. చేవలు చిగురుస్తాయట!

ప్రి:—ఎందుకు కనబళ్లేదని అడిగేవు కావూ? నిజంగా చూశావా వంకాయకోతలా?

వి:—నిజమే, నిజమే-కనబడకపోవడానికి కారణం ప్రయాణబ్బడలిక.

ప్రి:—ఇంతే? అయితే నాకు లేదూ బడలిక?

వి:—ఇంతే కాదు. నీతో దేశయాత్రలు చేసి దిగ్విజయం పొందివచ్చినందుకు నాటి వెలయాండ్రందరూ రోజుకొక్కొక్కటి చొప్పున స్వాగతోత్సవాలు చేస్తూన్నారు. ఊరంతా మోగుతూంది నీకీర్తితో-

ప్రి:—నాకీర్తితోనా? నాతో దేశయాత్రలు చేసినట్టు తెలిసిందా యేమిటి?

వి:—ఆ- మగవేషం వేసుకొని, రత్నగర్భుడని పేరుపెట్టుకొని మరీని! నీపేరు కూడా మార్చుకున్నావట! అంతదొంగతనం యేమి? బహిరంగంగానే వెళ్ళరాదా అన్నారంతానూ.

ప్రి:—హ! హ్హా! హ్హా! హ్హా! నీవు కూడా వచ్చావని తెలిసిందా?

వి:—నామాట లెఖ్ఖేమిటి? సూదితో దారాన్ని నన్ను వేరే వక్కాణించాలీ?

ప్రి:—పెద్దనాన్నగారింట బారసాలకి పిలిపించారట?

వి:—అక్కడే చూశాను. కాని యెప్పటికన్న మధురమై కనిపించిందేమోయి దాని రూపం? ఓహోహో! దాన్ని సృజించిన బ్రహ్మదేవుడు తనసంపూర్ణ ప్రజ్ఞ ప్రకటించుకొన్నాడు? ఎంతలక్షణమూ లేకపోతే నీవు కామిస్తావూ? అయితే వకటి: నీసాలోక్యంచేతనే స్త్రీలకు యెక్కడలేనినవకం అబ్బుతుందంటే సాయుజ్యంపొందినవాళ్లమాట వేరేచెప్పాలీ?

ప్రి:—ఒరే అబ్బాయీ, రాజముఖి సౌందర్యానికి కారణం ఆలోచించావూ?

వి:—సోగకళ్లు, తీర్చిదిద్దిన కనుబొమ్మలు, వరముల్లువాసి వంకరలేని పెదవులు.

ప్రి:—చబాష్! బాగా చెప్పినావు. నారత్నగర్భుడు సృష్టికంతటికీ శృంగారతిలకం- దాని సావంతం చూడాల్నంటే, వొక్కచుక్క కడుపులో పడ్డాక, ఆయెఱ్ఱని కన్నులు మాగన్నుపడి, ఆరముగ్గినగులాబీ జామిపండు వర్ణముగల నొసలూ, చెక్కిళ్లూ మరింత జేగురించి, అందుపై ముత్యాలతొపడంలాగ పట్టిన చిరుచెమటను చెదిరిన ముంగురు లుంగరముల్లాగ చుట్టుకొని, తిన్నగా హృదయదుర్గముం జేరి ముట్టడించు మందమందహాసముతోనూ, ఉండి ఉండి వెలువడు తప్పుతప్పు తేకపలుకులతోనూ మారుస్తూ, దివ్యకిన్నరీగానము నీసడించు గానామృతం

వర్షిస్తూ వున్నప్పుడు - అట్టి సమయములందు ఇంద్రియములకు కల్గు ప్రహ్లాదమే జన్మకు సార్థక్యం. దేవేంద్రపదవి నెడమకాలితోదన్ని యొక్కమాటీయవస్థలో దాన్ని సందర్శించి పోదగును. నీ వేమంటావు ?

వి:—అటువంటిదే- నీవభినవగోపికావల్లభుడవు- సంగీతసౌకుమార్యాల్లో నీవు కట్టిన నాట్యానికి పైమాట యెవ్వడాడగలడు ? కాని అమృతధారకూడా —

ప్రి:—ఇదే ప్రేమకళ్లుండవన్నమాటకి నిదర్శనం. అమృతధారయందు నీకున్నపక్షపాతంచేత నన్నావుగాని దాని కానవశిరీషకుసుమకోమలత్వ మెక్కడిది ? ఆతనూవికాసం ఎక్కడిది ? పోనీ చూడు: రత్నగర్భుడు బంగారు నగలు ధరించినపుడు స్వర్ణచ్ఛాయ శరీరమందు ప్రతిఫలించిందో శరీరచ్ఛాయ బంగారునందు ప్రతిఫలించిందో చెప్పగలవూ ? దివ్యమంగళవిగ్రహం !! కాని చెప్పకేమి ? అమృతధారనవ్వు వెల్లడినవ్వు. నవ్వినప్పుడు గెడ్డం యెంతపాకైన సొట్టపడుతుందో చూశావూ ? అదే నాపంచప్రాణాలకీ వునికిపట్టు- అదే నాస్వప్నాల కితివృత్తం !!

వి:—ప్రభావతిమాటేమిటి ?

ప్రి:—ప్రభావతివయ్యారం అంతా తెచ్చిపెట్టుకున్నది కాని స్వతస్సిద్ధమైనది కాదు. దాని నవ్వులో అమాయికత్వం లేదు. మాటల్లో పెద్దరికం సున్న-కాని కొమలిపిట్ట. ఆపొడుగూ, ఆఅవయవౌచిత్యమూ, ఆబీవికా, ఆకదలికా-స్త్రీలలో మరెందుగలదు? అంతచొరవా, అంతస్వతంత్రమూ, ఆచాకచక్యమూను ? ఆట మాణిక్యం ప్రభ అంతే గాని రసపోషణానికి పనికిరాదు. దీనికి కేవలం వ్యతిరేకం రాజీవి-ముగ్ధాలిముగ్ధ - సరాగం ఆడితే పెదవి మడతపెడుతుంది కాని నవ్వదు-నాకసహ్యం సుమా - చక్కగా నవ్వినప్పుడు గొంతుకులోంచి గుండెలు పైకూడిపడాలి, ముఖం తళుక్కుమని నీలమేఘంలో మెరుపులాగ మెరవాలి, చమత్కారాలు యెండపొడ కెదురుగా బెట్టిన కెంపుకమలంలాగ జిగ్ జిగ్ మని మెరపించాలి, మనం సరసం ఆడితే శరీరం నిలువునా వసంతమాలతిలాగ చిగుడు తొడగాలి. ఒక్కసౌందర్యం వుంటే చాలదు. స్వభావజన్యం అయిన రసావేశం వుండాలి.

వి:—సౌందర్యం అంటే జ్ఞాపకం వచ్చింది. ముత్యాలకోవలాంటి పలువరుస తీరునందు మగ్నమై చిత్తము దానిగానమాధుర్యం మరచిపోవును. ఆచెక్కిళ్లు చూచి బొట్టు దిద్దుకోవచ్చును. మొన్నరాత్రి గానసభలో అదికట్టిన లేతగన్నేరురంగుజలతారుబుటేదారీచీర ఆవొంటిమీద రాణించింది దీపం వెలుగున-

అహాహా! గంధర్వస్త్రీ అనుకున్నాను. ఆరవ్వాల కమ్మెట్లతో వాటా పంకాలు చేసి దానికన్నులు తేజస్సు కురిపించి నాకన్నులు మిరుమిట్లు గొల్పినాయి. ఆ పెదవులతో సాయంతరాత్మ వొక్క పెట్టున పీల్చివేస్తుందా అనుకొని వొక విధమైన ఆయాసం కలిగింది నాకు-

త్రి:—అంతే- అయిదునిమిషాలు కూర్చుని చదరంగం ఆడమను. అపుడ తెలిసిపో తుంది. మరబొమ్మను కూర్చోబెట్టినట్టే- ఓనవ్వా? ఓమాటా? సరసమా?

వి:—పోనీ గాని ప్రియదర్శనా, హిమవత్పర్వతప్రాంతమందు మనం చూచిన స్త్రీలు-

ప్రి:—వాళ్లేమిటోయి, వస్తాదులు- వాళ్ళలో నలుపులేదు చూడూ- రాణివాసస్త్రీలు పసినిమ్మపళ్లు- సాధారణస్త్రీలు చంద్రకాయల్లాగ యేమి చాయ! ఆముక్కులు అతిమానుష సుందరాకృతుల్రా! వాళ్లనత్తులూ, వాళ్ల మేలిముసుగులూ, వాళ్ళ ఒడ్డూ పొడుగూ! వాళ్ళలో వార్ధకం వొహాటుందీ, రోగమున్నూ? అప్సరసలంటే వాళ్లే సుమా, దేవకన్యకలూ! గుజరాతీసుందరీరత్నములకు ఆఔన్నత్యమూ లేదు, ఆపటుత్వమూ లేదు. మనుష్యులు పొట్టిన్నీ లేత అరటిమొవ్వల్లాగ మెత్తనానూ! కాని ముఖాలు పున్నపుచంద్రునివలె ఆయెఱ్ఱని కుంకుంబొట్లూవాళ్లూ యేమి తేజస్సు! వాళ్ళలో నాకు కనబడింది గాంభీర్యం—పెద్దఱికం. మళ్లీ పారసీ వాళ్లను చెప్పను. గాలిపడగలు, పట్టి చేతబొమ్మలు- గుజరాతీస్త్రీలబట్ట కట్టు నాకిష్టం. చక్కగా శరీరం అంతా కప్పడానికి చాలును. ఒకమూర యెక్కువా లేదు-తక్కువా లేదు. ఆహార్యావళీప్రాంతకాంతల గాగరాలు పొరలు తీసి చెరిపితే ఒక్కొక్కటి పదిమంది బీదవాళ్లకప్పవచ్చును. అబ్బ! యేమి బరువు! నడుస్తూంటే యేమితూగు ఆకుచ్చెళ్లు! మళ్లీ బొడ్డుపైభాగం అంతా పట్టి గాలిమేడే. పైంట యిష్టాపత్తిగదా! కొత్త మొగాళ్లం చూసినపుడే పైంట జ్ఞాపకం. ఆరవికో, రామరామ వెన్నుమీద తాడుతోముడి. ఆవెఱ్ఱిజడలూ, ఆపాపట్లో గుళ్లీ, జడచివరగుళ్లీ, చేతులకీ కాళ్లకీ ఆమొద్దునగలూ- అంతా చూడగా నిసర్గసౌందర్యం యివ్వలేదని సృష్టికర్తమీద అలిగి పంతాని కీవికారాలు పెట్టుకొనివున్నది రోంతాపాకు చేసుకున్నట్టు తోస్తుంది.

వి:—బట్టకట్టుమాట చెప్పవలసివచ్చినప్పుడు మళయాళస్త్రీలంత ఆధ్వానం యెవ్వళ్లూ లేదు.

ప్రి:—కాశ్యవాడీ కొండవాళ్లు తప్ప- కట్టుమాటకేం గాని, రామరామ, యెంకదారుణంగా పాడిచేసినార్రా మీబ్రహ్మిగాళ్లు వాళ్లని! స్వజనంలో పెళ్ళియాడరా

దట, తమరు పెళ్లి ఆడకుండా హాయిగా అనుభవించడం అట. పోషించేభారం అన్నదమ్ములట !

వి:—అయితే వారీ ప్రియా, నీదేశయాత్రలవృత్తాంతం అంతా సువ్రతాదేవికి విని పించావా ?

ప్రి:—సువ్రత మహాపతివ్రత- లోకమాత- సౌహార్దకల్పవల్లి- నేనామెసరస నుంద దగను. నేజేసే అనౌచిత్యాలకి ఆమె క్షాంతియే నాకంగరక్ష. ఆమెయోగ్యత నాకు వజ్రకవచం. నాయం దామెకు నిరవధికప్రేమా, నిరంతరప్రవృత్తిన్నీ- ఆమెయెద్ద నాకు గురువుదగ్గిర అపరాధియగు శిష్యునిలాగ, దేవునియెడల పాపా త్ముడగు జీవుని వలె, భయము- ఆసౌజన్యతాసూర్యకాంతిని దూరాన్నుండి కీర్తిం చడమే కాని యెదటబడి చూల్లేను.

వి:—నీయందు దైవభావమే ఆతల్లికి. నీయోగ్యతలో పదిరట్లు హెచ్చుజేసి యానంది స్తుంది. నీలోపాలికి హృదయం తాళం వేసుకుంటుంది.

ప్రి:—నాతో మాట్లాడడం లోనో ? నేను సకలగుణసంపూర్ణుణ్ణని నిష్కపటమైన నిండునమ్మకము. నాదుశ్చేష్టలు యీచెవితో విని ఆచెవితో విడిచిపెడుతుంది. నాప్రతాపాలు నేజెప్పినప్పుడు నన్నెంతో హెచ్చరిక చేస్తుంది. నాభిప్రాలు పైగావిని మరెవరిమీదో పెట్టి నాకు హితబోధ చేస్తుంది.

వి:—ఔనట ఆమె సౌందర్యమును, శీవినిజూచి మొన్ననీమధ్యను అరణ్యమందొంట రిగా నడుస్తూండగా పెద్దపులి యొకటి నాలుగుకాళ్లూ కుంచి, దూరాన్నే పరుండి సాష్టాంగపడి, ఆమెచన్నతరువాత లేచి తనదారిని బోయినదట. నేను పైగా విన్నాను. నాతో చెప్పిరావుకావేమీ వృత్తాంతం ?

ప్రి:—ఆమెకు దగినవరుణ్ణి కాను నేను - ఆమెను తలుచుకుంటే నాకు పాపభీతి కలుగుతుంది. నే మహారాజపుత్రుణ్ణని, రూపవంతుణ్ణని భ్రమసి ప్రాణధనము నాకర్పణం జేసింది. ఆమెయెడల నేనాడినప్రశ్నలకు నేనే దొంగ నైనాను.

వి:—ఇప్పుడు లోపమేమీ ? నీకునూ ఆమెయందు అమాయికవిశ్వాసమే కాదూ ?

ప్రి:—అదృష్టవంతురాలు కాదు. తగినభర్తకై నోచుకోలేదు. నాదురితములకు పైకనకపోయినా, లోలోపల తలచుకుని కుళ్లుతూండని నా అభిప్రాయం. ఆమె కై నేను ప్రాణత్యాగము చేయవలసినమాట- సమస్తప్రపంచమూ పరిత్యజించి యాప్రేమావతారమైన హృదయమును రంజించి సేవించవలసినమాట - కాని నాదురభ్యాసములు మానుకోలేను- మానుకోలేను. చెప్పకు నాకామాటలింకా. నేనామెకు తగను, తగను, నే పాపిని, ద్రోహిని.

(ఆకాశమునుండి దిగివచ్చునొక వెలుగు మొదట కొంచెము తోచి, క్రమముగా విశదమై ప్రకాశించును. ఇద్దరును నిలిచి మెడలెత్తి, ఆశ్చర్యముతో జూతురు. రెండునిమిషములు చూచునప్పటికి జాజ్వల్యమానమగు దేహముతో మనోజవుడు ప్రవేశించును. అతనిచేత రెండుపాములు మెలతలుచుట్టుకొని పడగలు పైకెత్తిన యొక లెన్నని బంగారుబెత్తము మణిమయమైన యంచుగల యొక జలతారు చెడ్డీ మోకాళ్లవరకును- మేజోడు - పల్చనిమెత్తనిజోడు- ఆట్టేవదులుగాక యొంటిని తగుమాత్రముగా నంటియున్న బంగారుజలతారుపువ్వులు గలజలతారు పట్టుకోటు. ఇరుప్రక్కల రెండు విశాలములైన రెక్కలు. తలకు బిగువుగా నమరియుండు టోపీ—వయస్సు 20. తనుచ్ఛాయ తెలుపు.)

మ:—(తాను పచ్చికపట్టున గూర్చుండి యిరువురును గూర్చుండబనిచి)

నరవరకుమార, సుకుమార, నవ్యమార,
నిన్ను బ్రత్యక్షముగ జూడకున్న నేడు,
నాకపురి నిండు నీదుసౌందర్యకథలు
విశ్వసింపను వజ్రిచే విన్న నిన్న

2.—వినుము గంధర్వలోకనాథునికి దూత
నే మనోజవు డనువాడ నేడు నీకు
మావిభుడు సేయనున్న సమ్మానవార్త
తెచ్చునుత్కంఠ నాకెంతో తియ్యనయ్యె!

ప్రి.—దివ్యపురుష, తరించితి దేవతిలక
నంతటిమహామహునను గ్రహంపుజేర్మి,
నతనిపంపున నీవరుదైనగాక
నాకు సమ్మానమూర్ధాభిషేక మయ్యె.

కావున తడయ కాలోకపాలు నానతి నాకు విశదీకరింపుము.

మ.—(తనకోటులోపలనుండి పసిడిమామిడిపండును దీసి ప్రియదర్శునని కిచ్చుచు)
మహారాజకుమారా, యిది యేమో యెఱుగుదువా?

ప్రి:—(తేరిపాఱజూచి, కేలగొని వాసనచూచి)మీ దేవభూములం దిట్టి దివ్యఫలములు ఫలించును గాబోలు. నేనెన్నడును గని విని యుండలేదు. నేనెఱుంగకున్న నేమి? యీయపూర్వసౌరభాకృతుల కిరవైన ఫలము జూచినంతమాత్రాన నా చిన్నఫలమని యెఱుంగుదును. దీనిపేరు మహాపుణ్యఫలమో? విశ్వసమ్మోహ

సాస్త్ర మిదియేనా ? (పరికించి, యక్షరముల బోదగని) "భు-వ-న-మో-హా-ను-ని-కి" వజ్రిదేవుని మహాప్రసాదసూచకమగు నీపారితోషికముచే నే ధన్యుడను. (తిరిగి వ్రేళ్లపై త్రిప్పుచు జదివి) "భు-వ-న-మో-హి-ని-కి" "హి-ని-కి" "మో-హి-ని-కి" మోహానునికి గాదా? కలగని మేలుకొన్నట్లయ్యెను. నాకనులు మిరుమిట్లయి నేజూడలేను. నాకీసంశయపిశ వారించి గంధర్వనాథుని చిత్తము దేటపరుపుము - మోహానునికి గాక పోయిన నాకు సమ్మానమెట్లు ?

మ:—(నవ్వుచు) నేటికి నాలుగుదినములై కుంతలాధీశ్వరుడగు విజయసేను నింట వివాహమయ్యెను. అమ్మహోత్సవమునకు రకాలవిహితు లగు మాప్రభువు లంతఃపురకాంతాసమేతముగా భూతలమునకు వేంచేసి పెండ్లిపందిట గొలువుండునవసరంబున, నదృశ్యప్రేరకమై యనసుమేయకర్తృకమై యీఫల మాకస్మికముగా దత్సమక్షమున వ్రాలెను. దాని జూచి గంధర్వసుందరీమణులు ఫలమొకతె యెత్తును చలము వేయుచురెట్లును బురికొల్ప బరస్పరజిగీషాపారవశ్యమున బంతము లాడుచున్నారు. న్యాయము ననుసరించి యీ వివాదము నిర్ణయించుటకు మహారసికశిఖామణివగు నీకన్న మఱొక్కడు మూడులోకములందును లేదని వజ్రిదేవులు నిన్నే పరీక్షాధికారిగా నియమించి గంధర్వయువతీలలామంబు లగు హీరాసుమేధాప్రోజ్వలాదేవుల నిందుకిమిత్తమై యెల్లుండిమధ్యాహ్నమున దియ్యెడ కవతరించునటు లానతిచ్చినారు. వారియం దెవ్వరు భువనమోహినియో నీకుదోచినవిధమున నిర్ణయించి యీఫలము వారికిమ్మని ప్రభుఫల యాజ్ఞ.

ప్రి:—(నిస్పృహాగా) శిరసా వహించితి నని విన్నవింపుము.

(మనోజవుడు నిష్క్రమించును.)

(విఘ్నభట్టుతో) గంధర్వస్త్రీలను కూడా కళ్లారా చూస్తాం రేపు. ఏమి చిత్రమైనపండు !

వి:—వెఱ్ఱివాడా ! !

ప్రి:—ఏం ఆలా అన్నావ్ ?

వి:—అందలి ప్రత్యవాయం ఆలోచించవేమి ? నాన్నకి పెళ్లే కాని అమ్మకు నవిటి వస్తుంది ! !

ప్రి:—ఏం, ఏం ?

వి:—నీవు విమర్శింపవలసినవారు దేవకన్యలు, అమానుషసామర్థ్యంగలవాళ్లు. నరులంటే వాళ్లకి పట్టియప్పుడే గోళీకాయలు. ఇప్పుడు నీవెవళ్లనెంచకపోతే వాళ్లే మారణహోమం చేస్తారు. తెలిసీ తెలియకా నరులు దైవానికి విప్రియంచేసి దుర్గతులపాలవుతారు. వజ్రియంతటి మహానుభావుడు చాలలేక నీమీద వేట్టేశాడు. నీవు వెట్టినాగమ్మవై యేదో వుపాయంచేత తోసెయ్యక గంధర్వస్త్రీలని చూస్తాను గదా అని వొప్పుకున్నావు?

త్రి:—అయితే యేమి దారోయి? ఇదెక్కడొచ్చింది మనకీవుపద్రవం? ఏలాగు తప్పించుకోవడం? నావల్లకాదని చెప్పేస్తునా?

వి:—చా! చా!—చా! వల్లకాదంటే పీపు చిల్లుగొడ్తాడు వజ్రి- వాళ్లు మనకి దైవాలోయి! మనసుఖదుఃఖాలు వాళ్ళకో ఆట- చిన్నపిల్లలు తూరీగల్ని బట్టి ఆడిస్తారు చూశావూ? కూర్చున్నదాన్ని యెగరేస్తారు- యెగిరేదాన్ని పట్టి రెక్కలూడదీసి ధారాలు గట్టి యొకదాన్ని యొహవేపూ, మరోదాన్ని మరోవేపూ పాకించి అవి యమయాతనపడుతూంటే చప్పట్లుగొట్టి గొల్లున కేకలేస్తారు? ఆ మోస్తరనుకో మనబతుకులూ మనఐశ్వర్యాలూ మనపెంకితనాలూను వాళ్ళచేతులో- కానీ చూతాం- ఇది మంచికే వొచ్చిందేమో- ఆలాగే అనుకుందాం ఫలితం తేలేదాకా దాటేమార్గం వుందిగనుకనా. ఇది మనకి తెలిసిందిగనక యింతాలోచిస్తున్నాం. తెలియకుండానచ్చే వెన్ని-

(ఇద్దఱు నిష్క్రమింతురు. ప్రియదర్శను డించుక ఖిన్నుడై.)

---

## ద్వితీయాంకము - ద్వితీయరంగము.

---

(అమరావతియందు అఖండవైభవోన్నతితో నలంకరింపబడిన వజ్రినగరు-కాలము రాత్రి- వజ్రి, హీరా, సుమేధా ప్రోజ్జ్వలతో గూర్చుండి ప్రవేశించును.)

వ:—ఔను, మనోజవు డిప్పుడే చెప్పి వచ్చినాడు.

సు:—మహాప్రభూ, అక్కడ కెప్పుడు వెళ్లునది?

వ:—రేపుమధ్యాహ్నము.

ప్రో:—స్వామీ, యీప్రియదర్శనుడనువా డెవ్వడు?

వ:—వానివృత్తాంత మద్భుతమైనది. చెప్పుచుందువా?

ప్రో:—చిత్తము.

స— వినవమ్మ కాశ్మీరవిషయాదివిభుడు
ధర్మబాహుండు సార్థకనాము డడరు-
వాని కవ్యాజప్రజానురాగంబు
సాత్వికశీల మీాశ్వరపాదభక్తి
గలియించె సాకృభవకీర్తిమహిమ-
భాగ్యలక్ష్మియు భార్య, ప్రాణాతిమాన
పురుషార్థసంతతి బోనిసంతతియు; -
కడపటికొడుకు మీాకామ్యప్రదాయి
ప్రియదర్శనుడు విధుప్రియదర్శనుండు
కడుపుననుండ నొక్కనిశీథవేళ
దల్లి స్వప్నముగాంచె దనగర్భవీధి
వెలువడి యొక్కదివ్యయశోలరేగి
ప్రళయానలప్రతాపము సూపి, నిఖిల
రాజ్యమునుసిజేసి రావించెననుచు
తల్లడమంది భర్తయు దాను దైవ
వేత్తలనెల్ల రావించి యోజించి
మరునాడు కోటిమన్మథాకారుమూర్తి
నుదయించు నిసువును హృదయంబు ప్రీల
దలకు చరణ్య మధ్యమున బోవిడువ
నానతిచ్చిరి చంపుడన నోరురాక.

కి—అయ్యో, పాపము! ఇందెవ్వరిపై జాలిపడవను? ఇటు కన్నులు తెరవనిపాప కుదయింపగానే బలవదస్తమానము- అటు దౌర్భాగ్యులకు జనకులు పిల్లకై రాజ్యము బోగొట్టుకుందురా? రాజ్యమునకై దివ్యతేజోమూర్తియగు సంతానము గోల్పోదురా?

స్త్రీ:—ఎంతమూర్ఖు లీమానవులు నాన్నగారూ? వస్తువులు విడచిపెట్టి పట్టినీడలతో యుద్ధము జేతురేమండీ? జాతకచక్రం మార్చుకొన్నచో ఫలములు మారునా? అదిగాక నిమిత్తములతో సరియా? ఒకనిమిత్తమును దొలగించికొందుమేని మఱినూరు పొడసూపవా? ఏసూచనయు గనిపింపకే పిడుగులాగున వాటిల్లును పద్రవములెన్ని?

సు:—ఏమి సేయుమన్నావు పాపం? పౌరుషాతిరిక్తమై దుర్నివారమగు దైవము శుభాశుభముల జేకూర్చుచుండగా దానిస్వరూపస్వభావములను పూర్వోత్తరములను దెలిసికొనలేక, యే దైవమెందుండునో, దేన నేమంగళము లభించునో, యే యమంగళము తొలగునో యని యంధప్రాయముగా భ్రాంతిపడి, విన్నదంతయు నమ్మి, కన్నదంతయు గొల్చి యచేతనములందు సంకల్పమును, మానవులందు దేవత్వము, మాటలయందు మంత్రపాటవము, యాదృచ్ఛికసంభవములగు యోగములందు దైవనిర్మాణమును గల్పించి, సామాన్యవిషయములందు జొరబడి, తడబడి, యిన్నిపాట్లకు లోనగును నరుడు.

హీ:—స్వామీ, తరువాత నేమైనది ప్రియదర్శనునిగతి?

వ—ఇట్టినట్టడవియం దేకాకియైన
రాకొమరుని యార్తరావ మాలించి
వానిదైవంబు భవ్యకృపాసమృద్ధి
బంపినతోడేటిబాలెంతరాలు

తలిదండ్రులకు లేని దయ చుట్టుకొనగ
రెణ్నాళ్లు పగలును రేలు పాల్గుడిపె-
ధాత్రీతరువొకర్తు ధాత్రియై సాంద్ర
శాఖాభుజంబుల సవరించె నీడ-
తియ్యదాపుల నించి దిరిసెన్న యొకటి
పూలపొత్తిళ్లలో బొదివి లాలించె-
తమిగొని దైవంబు తనపాలగలుగ
జెనుఫిరంగిముఖాన బ్రియమొందవచ్చు-
గొఱ్ఱెలగాపరి కుఱ్ఱడొక్కండు
కొని తుదకొక్కవిప్రున కొప్పగించె
వానిమక్కువ గారవపుబేర్మి బెరిగి
క్రొక్కారుతెలిగల్వగుత్తిచందాన
ముద్దులమూల్గయై మోహంపుజెలమ
కొండలకొమరుడై కోనరారాజు
సింగంపుగొదమనెచ్చెలి, బోయగురువు,
విలువిద్యక్రీడి, విద్యలవేల్పుటొజ్జ,

ముదితలవలరాజు, మురళిగోపాలు
డయి నుంత వయసురా, నమరాంగనలకు
సౌకుమార్యంబందు, సౌజన్యమందు
వంకలుదిద్దు సువ్రతయన్న సాధ్విఁ
బజ్జను ప్రవహించుపాటలావతికి
ముద్దులకొమరిత మురిపెంబు గొల్పి
ప్రణయము నమ్మించి పరిణయంబయ్యె -

ప్రో:—"ప్రణయమునమ్మించి" యనుచున్నారు-ఇప్పుడామె నేలుచున్నాడా?

వ:—ఆ, అయిన నేమి, వాని హృదయము ఝంఝూవాతముచే జెదరిన కొలనింబోలె చంచలమై యొక్కచో నిలువదు. నిరంతరరసనేవాపరుఁడై, నితాంతరసార్ణవ క్రీడనోత్కంఠచే దద్రసోపాదానవస్తువులం బెందును సంతుష్టిఁగొనక సంతతము నూత్నప్రియుఁడై యుండును.

సు:—వీఁడా మమ్ముల నేంచువాఁడు? అంత అవ్యవస్థితచిత్తుఁడు మాకు న్యాయమెట్లు తీర్పఁగలఁడు?

వ:—యువతీజనసౌందర్య మెంచుటందు వాఁడసమానుఁడు, ఒక్కయువతులే కాదు. అపూర్వసుందరవస్తువు లన్నిటియందును వానిచిత్తము పరాయత్తమే. రసగ్రహణమందు వాఁడులోకోత్తరుఁడు. చిగురించుతీవలయందును వికసించుపుష్పములందును వానికింగలప్రేమ మనకు మనసంతానమందు లేదు. ఉదయసూర్యుని తేజస్సు శరత్కాలపూర్ణిమాశశాంకుని మనోజ్ఞత, ప్రకృతికాంతాభుజంగుఁడగు వసంతుని కైనేతప్రోదతనము, విశ్వకర్మని యనంతకల్పనావైదగ్ధ్యమును విన్నబుచ్చు మానవశిల్పచమత్కృతియు, వానికి హృదయోజ్జీవకరసాయనములు. సంగీతసుధాంబురాశిసాహిత్యకల్పలతాలతాంతము-వానిసామర్థ్యమున కీడులేదు. వానికి దోచినసౌందర్యరహస్యము లింకొకనికి గ్రాహ్యములు కావు. సృష్టికావ్యమునకు వాఁడునేయువ్యాఖ్య యాపరమేష్ఠికిని అశ్రుతపూర్వము. వానితీర్పులకు పైతీర్పు లేదు. వానియుక్తులకు శేషుఁడు ప్రత్యుత్తరము జెప్పలేఁడు. వానిహేతువులను బృహస్పతి యధిక్షేపింపఁజాలఁడు.

ప్రో:—దేవా, సౌందర్య మనుభవైకవేద్యమే కాని యుక్తిచేతను హేతువులచేతను సమర్థింప దగినదా? హేతువులచే బోట్లుపెట్టినిలిపిన మనోజ్ఞత యేపాటిది?

సు:—ఔను, మహాప్రభూ, సృష్టియందలి రామణీయకము తారతమ్యములేక సర్వ

జీవులకు గోచరమగుటే భగవంతుని సమదర్శనత్వమునకు దార్కాణ. తనసంతానమందు బక్షపాతములేని జనకునట్లు విశ్వజనకునికి సమస్తభూతములందును గలవాత్సల్యముకొలది రసావేశము సైజమగు మహాభాగ్యముగా దయచేసినాడు. కృత్రిమమైన సంశయాస్పదమగు రసమునే హేతువులచే నిలబెట్టవలెనుగాని నిసర్గమనోహరమైన వస్తువు ఇంద్రియధారణమాత్రముచే బ్రాణుల కాహ్లాదము గలిగింపదా ?

వ:—రోగిజిహ్వకు షడ్రసోపేతములగు భోజ్యములు రుచింపవేల ? జాత్యంధునికి దృశ్యప్రపంచమందలి మనోహరత గోచరము కాదేల? సహృదయత్వము సహజమయ్యును దేశకాలపాత్రములకు లోనై యొక్కొకచో రాణింపదు. అట్టియెడల రసగ్రహణ విశారదుడగువాడు ఇది సుందరమైనది, యిదికాదు, సౌందర్యహేతువు లిట్టివి అని రసహీనులకై యేర్పరింపవలసి యుండును.

ప్ర:—రసహీనులకును అనుభవహీనులకును జెప్పిమాత్రము లాభమేమి ?

వ:—కేవలవిరసులకు జెప్పియు లాభము లేదు. మృతకళేబరమును లేపలేనియట్లు రసస్ఫూర్తియందు వస్తువులకు దారతమ్యములు గలయట్లే కేవల రసద్వేషము మొదలు, రసపారవశ్యమువఱకును మనుష్యులందు దారతమ్యభేదములు వేనవేలు గలవు. కాని యది ప్రకృతాంశమా? ప్రియదర్శనుడు స్వతస్సిద్ధముగా సరసుడు. తీర్చికొనిన వజ్రపుదునకవలె వానిచాకచక్యమున కీడులేదు. అందుపై నఖండానుభవశాలి. వానికింగల లోప మొక్కటియే-మతమునకును ఆచారమునకును వైరుధ్యము. మనోవ్రథిమ గలవాడు కాడు. భావము లనన్యసామాన్య రసావిష్టములు. మాటలో అఖండపాండితీమండనములు. కాని క్రియలు తత్కాలఫలైకప్రేరితములై యత్యంతపామరములై స్వపరార్థహాని నొనగూర్చునట్టివి.

హి:—సహజశీలముతో బనిలేదు. అనుభూతితో నంతకన్న పనిలేదు. దైవశిఖామణులగు దేవర అప్పటికిట్టి బుద్ధిదోషించిరేని ఆప్రకార మేర్పరించి తగవు తీర్పగలదు- ఇంతకును బరమరహస్య మిదియే.

వ:—ఆమాటసత్యమే. మనుష్యులబుద్ధుల బ్రేరేపించుశక్తి ఆయావిషయములందు దైవతములమైన మనకందఱకును గలదు—కాని, మీరుగాని నేగాని లోకపరిపాలనాసూత్రమునకై భగవంతు డేర్పరచిన శాసనమున కెంతమాత్రమును వ్యతిరేకించి వ్యవహరింపలేము. ఆయాజీవులకర్మల ననుసరించి యొండొరులయెడ

న్యాయాబుద్ధులు పుట్టింతుము. కర్మయే సమస్తప్రకృతితంత్రమును - మనము దానిచేతి యాయుధములమే కాని మనకు స్వాతంత్ర్య మెక్కడ? నిరంతరసత్కర్మనిరతులైనవారికి మన మెంత తలక్రిందుపడినను అపకృతి జేయలేము. దుష్కర్మతత్పరులగువారికి మనకన్నబిష్టులయ్యును ఉపకృతి జేయలేము. నిరంతరపుణ్యశీలము జన్మజన్మములకు శ్రీ రామరక్ష-అత్యంతభగవత్సేవాపరాయణులై భవమంతయు బరమార్థనిమిత్తముగా దలంచుమహనీయులకు మన మెల్లపుడును దాసానుదాసులమే- వారియెడ మన మెప్పుడు నస్వతంత్రులమే-సర్వజీవైకభాగ్య మనందగు కృపాకటాక్షప్రసాదముచే గర్మబంధముల విప్పి, పాపముల సైరించి ప్రోవగలుగు బిరుదొక్కభగవంతునికే చెల్లినది ఈపరమార్థము నీవెఱుంగనిది కాదు. స్వకార్యములందు మఱచి భ్రాంతిపడుచుందువు కాని-ఈవాద మింతటితో జాలించి రాబోవుపనులందు మనస్సు బెట్టుదము. రేపు తెల్లవారగనే ప్రయాణము జేతురు కాదా? వింధ్యపర్వతమందలి మేఘమేఖలశృంగము మీ గమ్యస్థానము. ఎఱుగుదురు గద ?

ముగ్గురును—చిత్తము. (అందఱు నిష్క్రమింతురు)

---

## ద్వితీయాంకము - తృతీయరంగము.

---

(మేఘమేఖలశృంగపునెత్తమున గ్రియదగ్గను నొక కదంబమూలమున పచ్చని దట్టపుబచ్చికచే నిండి విశాలమై క్రమోన్నతమైన యొకబోదెగట్టున మోచేతి నాను కొని యరచేత శిరస్సును బ్రాపుచేసి యొత్తిగిలి పరుండును. రెండవ చేత స్వర్ణచూత్రము భద్రముగా నేలదగులనీయక పట్టుకొనును. ఎదుట దగ్గరగా సుచరిత కూర్చుండును. ఎడనెడ వివిధవర్ణములు గలపువ్వులు పచ్చికపట్ల వికసించి మనోహరముగా వ్యాపించియుండును. తరుచ్ఛాయ మధ్యాహ్నపు సూర్యరశ్మినుండి యాప్రదేశమంతటిని గాపుచేసి చల్లని మందమారుతమును పుష్పసౌరభమును గవియించుచుండును. అనతిదూరమున బాటలావతీప్రవాహము కిన్నరీగానము నాలాపించుచు జలజ జలవిహంగమభూషితమై కనువిందుగా బ్రవహించుచుండును. కాలము ఈషన్న్యూనమధ్యాహ్నము.

సుచరితతనుచ్ఛాయ సితాంభోజచ్ఛాయ. వయసు పదునెనిమిది. నవవికస్వరకుసుమకోమలి. నగుమొగమునందు బరమసంతుష్టహృదయము ప్రతిఫలించుచుండును. ముద్దులొల్కుసిగ్గు శరీరమంతటికిని నూత్నవికాసము గలిగించుచుండును. ముస్తాబు అతుపచ్చ

లేతనాచురంగు చీరె. లేతనీలిరంగు రవిక. పచ్చలహారము ఇంద్రనీలపుజూముకాలు. బంగారువజ్రపుటొడ్డాణము. దండలకు పచ్చలయు నీలములయు గెంపులయుఁ వంకీలు. నవమల్లికాది వనమాలలు. తామరతూండ్లతో గట్టినహారములు. చెవుల శిరీషములు. ఉంగరములముంగురులపై గిసయలకుసుమగుచ్ఛములతో జతురముగా గట్టిన కిరీటము. మెడలవరకును గట్టబడిన శిరోజములకు వెనుక నాగరము ముందర వజ్రఘటితములగు సూర్యచంద్రులును అమర్పబడియుండును. తక్కిన కురులు విపులముగా బిఱుదులవఱకును విరియబోసి యుండును.)

ప్రి:—(సువ్రతవైపున కొరగి) సురసుందరులకే. అందులో వారు మువ్వురకే యని నిర్దిష్టమైనది.

సు:—నాదక్కడ నున్నవారికే. వారిలో సౌందర్యముగల యొకరి నెవరినో విన్నబుచ్చుటకు వజ్రిపన్నిన పన్నుగడలాగు నగపడుచున్నది.

ప్రి:—అది యెట్లైన గానిమ్ము-కాని యిది యేమి మాగొప్పపని యని నాకొప్పగించినాడు? భూర్భువస్స్వర్లోకములందంతటను భువనమోహినీ బిరుదునకు బాత్రమగు సుందరీమణి నొక్కతె నెంచి యీదివ్యఫలము దానికి నిమ్మన్నచో వజ్రినియోగమునకు, నాప్రావీణ్యమునకుం గూడ దగియుండును.

సు:—భవ్యశీలా, ముల్లోకములం గలస్త్రీప్రపంచమం దేర్పరింపవలసినచో నాసురజ్యేష్ఠునికిం గూడ తరముగాదు. గంధర్వేశ్వరుడు మీపై నీభార ముంచినందుకు మీనిర్దుష్టపరిశీలనా చాతుర్యమునకును, నిర్మలన్యాయశీలమునకును మాటదక్కుటకీమార్గమే బాగున్నది. అదియునుంగాక గంధర్వులను మించు మానవాదిస్త్రీ లెవ్వరుందురు?

ప్రి:—ప్రియసువ్రతా! నిఖిలప్రపంచమందలి స్త్రీజనములో—నిఖిలచరాచరసృష్టియందు గలవస్తువులలో శిరోభూషణమునెంచి దాని కీఫలము సార్థకసమ్మానముగా నిమ్మని విధించియుండిననే నాపని సులువై యుండును.

సు:—భవ్యశీలా, అదియెట్లు?

ప్రి:—(లేచికూర్చుండి, రెండుచేతులను సువ్రతమెడకుజుట్టి దానిశిరస్సు దనఱొమ్మునం జేర్చి యాఘ్రాణించి ముద్దిడుచు)ఎట్లని యడుగుదువేల? అరక్షణ మాలోచింపక నీకిచ్చివేతును. ఇచ్చి దేవమానవస్త్రీగణమంతటిని సమ్మానింతును. అప్రమత్తపరిశీలనాకౌశలమున కిహపరములందంతటను అఖండసమ్మాన మార్జించి కొందును.

ప్రోడతనమెల్ల వడబోసి ఘూనిసేయు
సృష్టి కగడైతినని ధర్మచింత బొగిలి
భవ్యసౌందర్యశీలసౌభాగ్యసార
మమర నిను జేసె నఘమర్షణముగ బ్రహ్మ!

ఎట్లని యడుగుదువా యింకను?"భువనమోహిని" కన్నవాడు" త్రిభువనైకమోహిని" కన్నాడు కాడు. "త్రిభువనైక పరమకల్యాణి"కన్నాడు కాడు. ఆహా! కాని యసంభవము సంభావించి యుబ్బిళ్లూరి ప్రయోజన మేమి? ఇయ్యెడ ప్రియభీష్టము నెరవేర్చుటకన్న కర్తవ్య మొండులేదు.

సు:—(ముఖము జేగురింప సిగ్గు నభినయించుచు,మందమందస్మితముతో) ప్రాణవల్లభా, మీమహోదారశీలముతో నంటిరిగాని యట్టి విశేషణములకు నేనెంతదానను? నాతో అంతల సైరించుటేగాక, భావమందు సవరించి, వన్నెబూసి, తద్భావ విగ్రహముం గొనియాడితిరి గాని నన్ను గాదు. మీకు బుట్టుతోడవైన పరన్యానతాసహనముచే నేనెంతయు ధన్యురాలను.

ప్రి:—నీలక్షణ లక్ష్మీవిలాసము నీవే మెఱుంగుదువు? ఎవరియోగ్యతంగూర్చి వారు ప్రమాణమా నిరుపమానతేజోవిలాససారస్యములచేత గమలాకరమంతటికి సాధరణాయమానమగు నూత్నవికస్వరసరసీరుహంపు నొయ్యారము దానే మెఱుంగును? తటిని యేమెఱుంగును? హృదయోత్సవముగా దిలకించి, పులకించి తన్నత్నోజ్జ్వతామహిమావగాహమునకు గొలదిచాలకవిస్తుపడి విన్నబోవుచూపఱ దృక్చంచరీక మెఱుంగునుగాని—?

సు:—తన్నత్నోజ్జ్వతామహిమకాదికారకుడగు సౌహార్దసహస్రాంశుడు, లోకబాంధవుడు, పద్మినీవల్లభుని నిడుదకన్నులకుం దోడిగిన సహజసత్వవర్ణసులోచనము లెఱుంగ ననుడు!

ప్రి:—పరమపతివ్రతావతంసమగు నాపద్మిని సహజసౌజన్యతాసులోచనమున కాద్వాదశాత్ముని యవజ్ఞయే మహాప్రసాదముగా, ప్రణయపరమావధిగా గానిపించును. కాకున్నచో విశ్వజీవమగు జగచ్చక్షువు నొక్కరాజీవమే తనమిత్రుడని యాత్మస్తవము జేసికొన యలరు టెంత చేలతనము!

సు:—అట్టిప్రియదర్శనత్వమును విశ్వవిశాలప్రేమయుంను గలిగిన మహామహునిజూచువారెల్లరు నెవరికివారే, నామిత్రుడు, నామిత్రుడని నిరూపించికొని యానందించుట నైజమును సత్యమును గూడ- కాని పద్మినీప్రియుండను బిరుదాతనికిని

దప్రియ యనుమహాపదవి యీముద్దరాలికిని జగత్ప్రసిద్ధమైనిరాతంకముగ జెల్లుచున్నది. నవమల్లికాపుష్ప దనరాదూ? దేవప్రసూనమగు పారిజాతముకన్న మిన్న లేదుగద? పారిజాతప్రియయు దనరాదూ? సరోజముకన్న మనోహరములైన పుష్పములు వేనవే లుండనిందు-అవన్నియు నాతనిదర్శనమాత్రముచేత హృదయముప్పొంగి వికసింపనిందు-ఆతని నెడబాసినంత వాడి కృశించి పంచత్వమొందనిందు - ఆపరమాత్మునికి దానియం దేకాగ్రచిత్తము. ఆయిల్లాలి పతిభక్తికిని ఆమహోదారుని పాతివ్రత్యమునకును జక్కగా సరిపోయినది.

ప్రి:—నీచేలతనము జూచి నాగుండె నీరై పాఱుచున్నది. నీదుర్వారవిశ్వాసము జూచి నాయొడలు కంపించుచున్నది.

సు:—భవ్యశీలా,నాయమాయికవిశ్వాసమే యెప్పటికైనను నాకు శ్రీరామరక్ష. ఎప్పటికైనను సర్వజ్ఞుడగు నాతేజోమూర్తి యనన్యశరణ్యయగు తనపత్నియం దేకాగ్ర చిత్త ముంపక మానడు.

(నలుదెసలనుండియుఁ గిరాతబాలురును బాలికలును గంగముపైకి వచ్చి యాకాశముపంకనే విరగబడి చూచుచు నలుగడలను బరుగెత్తుదురు. ఇంతలో నభోమండలమంతయు దళుక్కుమని ప్రకాశించి యాతేజస్సు క్రమక్రమముగా విశదమై చేరువయై యంత మాయును. మఱియొక నిమిషమునకు నలుగురు కిరాతబాలురు నలుదిక్కులనుండి తొందరగా వచ్చి సుప్రతాప్రియదర్శనుల జూచి తిరిగి తొందరగా నొక్కదిక్కున బరుగెత్తి పోదురు.)

ప్రి:—ఇదే వచ్చుచున్నారు దేవకాంతలు. మనజాడ లరయుటకు జానపదులనలుగడల నంపియున్నారు. నీవొక్కనిమిష మోసరిల్లి యల్లదె యెదుట ఖుష్పించిన మాలతీలతానికుంజముచాటున నిలువబడి జరుగుదాని నారయుము. ఆమయూరము గంధర్వరాజ్ఞియగు ? రాదేవి వాహనము- ఆహా! దాని నైగనిగ్యము! (సుప్రత చాటునకు బోయి కనబడక చూచును.)

(అంత హీరా, సుమేధా, ప్రోజ్జ్వల లొకరినంటి యొకరు ప్రవేశింతురు.)

ప్రి:—లేచి, చెంతకుబోయి సాగిలి మ్రొక్కి, తిరిగి లేచి కృతాంజలియై)

జయ జయ ప్రసన్నమతులార, సర్వజీవ
భాగ్యరచనాధురంధరప్రతిభలార,
కర్మసన్యాయి తేద్ధసంకల్పలార,
స్వాగతము మీకు త్రికరణస్వాగతంబు!

2. మాజనుస్థితిలయములు, మాశుభాశు
భవములు, ప్రియమప్రియము, భయాభయము లన్ని
మీకు సయ్యాట, మాబుద్ధి మీవశంబు
మిము మఱచు పౌరుషము నేలమీఱు సామ!
3. సరసి బాయుసరోజకేసరములట్లు
వాడె నెమ్మేనుతీవ లధ్వశ్రమాప్తి-
స్వర్గమో యిది! మారవిపావకుండు
మావిరులుతాలు మీసుకుమారతలకు!
4. మేటిసెలయేఱు మిన్నేటి మించి పాఱు
చరులఁ దుంపర పొగనింద్రచాపమినుడు
దిద్దుచో బట్టుపసిరికతిన్నె లందు
విశ్రమింపుడు సుంత మీవిరులచెంత.
(ప్రియదర్శనుడు పల్కినంతనేపును దేవకాంతలు నిశ్చేష్టితలై యతని రూప మునే వెఱగంది పరికింతురు.)
సు:—పొలుపుబూదండ భూషితపురుషకాండ
భువనసాంత్వన మైనసీమూర్తి గ్రోలి
యలతసుఖమయ్యె జూడ్కు లకయ్యె విందు
సీయుదా ..దరము మఱి నించె మమత.
ప్రో:—ఉన్నతోన్నతగిరిశృంగముంచి, పాద
శృంగములపయి మాదృష్టి ద్రిప్పు విధమొ!—
సృష్టికి గిరీటమీవు నిన్ జేయువేళ
నరునిచే విశ్వమేలింప నలువ పన్నె!
2. పగటి వెలిగించునవ్వు భవ్యప్రభాప్తి
బ్రకృతికై సేయు చెల్వు—సపరగుచోట
వలపుప్రేరించు జయలక్ష్మి వాసి గాంచు
భవముతో సఖ్యమొనగూడు భయము వీడు-
పి:—(సర్వధికార్యాధికారగర్వముతో ఎదుటనిలిచి)
శ్రమలు తోచునో కార్యభారము కలంప?
పొగడికలకేల పంతాల బొగులు వేళ?—

వేల్పులకు వేల్పవైతి వివేకమన్న
నదునెఱిగి జన్మకల్యాణపదము సేత.

2. తెలియుదో? వట్టి గంధర్వదేవిఁగాను-
నేను లోకస్థితిని విశ్వనేత్ర్రనియతి
బౌరుషపులోనియంత్రాన భాగ్యసూత్ర
మేనె నీకృషులకు దరివాన నేనె!

సుప్ర:—(స్వగతం) ఆ! యేమి యీ యహంకృతి! పరులకుత్కర్ష రాకుండ దా విజృం భింపవలెనట!! అధికారమాద్యమునకు దేవత్వముకూడ చికిత్స కాదు కాబోలు! అంతకు దానే యట! దైవమే దేవుడయ్యేనేని దన్నియంతృయగు దేవునకు మఱిచోటెక్కడ? జీవునికి స్వాతంత్ర్య మెక్కడ? కాని కేవలాధికారోన్మాద ముతో నన్నుమాట కాదేమో, కొంతవెఱపించి, బూకరించి, మఱి కొంత మోహపఱచి కార్యసిద్ధి జేకొను ప్రయత్నమా? ఏమైననేమి—కామపార వశ్య మావహించినపుడు దైవమానుషశీలములు రెండునొక్కటే. పరస్పరజిగీష, తారతమ్యములేక, సర్వజీవుల నొక్కవిధముగా గింకరుల జేసికొనును-

సీ:— భవసహస్రములకు రాని భాగ్యమిప్పు
డలవడియె నీకు: విధికి బ్రత్యక్షపూజ;
నడుగు వరముల ధాటిమై జడియు దేల?
సమయ మెడపితివా మాకు సర్వమొకటె!

2. పలుపలుకు లేల నరపాలబాల వినుము
ఫలము నాకిచ్చి శతకోటిఫలిత మొందు:
మఖిల భూమండలాధిపత్యంబు నిస్స
పత్న తేజంబు విపులసంపత్తి మహిమ-

సుప్ర:—(స్వగతం) ఏమి గౌరవమమ్మా, లంచమిచ్చి పేరుతెచ్చుకొంట? తలచుకొన్న పుడెల్ల యౌన్నత్యమునకు గారణమైన నైచ్యమే జ్ఞాపకము వచ్చుటకా? ఏమి సుఖ మేమి ప్రతిష్ఠ-యొంతగుండె లజ్జాదుర్భేదము గావించికొన్నను—

సీ:— సకలనరకోటి నిత్యసేవకులు నీకు—

సుప్ర:—(స్వగతం) బాపురే! యింతే ప్రజలగతి? నిత్యసేవకులు? నిత్యసంరక్షణీ యులు కారా? నీవీలాగునే యేలుచున్నావు కాబోలు నీలోకములన్నింటినీ? నీయుత్కర్షకొఱకా యిన్నిజీవుల బుట్టించినాడు బ్రహ్మ?

హీ:— ఆధ్రువంబుగ నీ ప్రక్క మడలు గొల్వ—

సుప్ర:—(స్వగతం) అడలుగొల్వ ఓ ప్రభుత్వపరమావధి కాబోలు! ప్రీతిగొల్వనం దూ, మాటకైనను! అడలుగొల్వ సెంతసేపు? అడలినప్రజ లెన్నాళ్ళ విధేయులు కాగలరు?

హీ:— ఆరుకారులు చంద్రసూర్యాతపంబు
లోకపరి సీదు రాజ్యాన నుజ్జ్వలించు!
2. పంచభూతముల్ సీసొత్తు పశువు, పక్షి,
మృగము సీ పేరిసడి విన్న బెగడి యడుగు.

సుప్ర:—(స్వగతం) ఏమి భాగ్యం? పశువు, పక్షి, మృగము నరుడు బెగడి, యడలి, యడగినగాని నీసర్వోన్నతి బయలుపడదు కాబోలు!!

హీ:— సార్వభౌముల కదపు సింహాసనంబు-
లోకపాలుర సాటి యూ దో కుమార!

సుప్ర:—(స్వగతం) సౌజన్యమందును, ఆత్మత్యాగమందును గాదు సుమీ! అధికార దుర్మదావేశమందు- తల్లీ, చాలును! నీయంతటి వానిం జేతువు కాబోలు నావిభుని! భవ్యశీలా! సౌమ్యతలేని ప్రాభవమునకై యెన్నడును మెత్తబడకుము- ధైర్యము గలిగి దీర్ఘదర్శివై యెంచు - ఇది నీశాశ్వతమానావమానములకు దరుణము.

సుమే:—(గాంభీర్యముతో చిన్ముద్ర బట్టి, హితోపదేశవైఖరి నభినయించుచు)
బలము, దర్పము, ప్రాభవము, ప్రతాపమును
కలకాలమును జెల్ల—వలలట్లు పొచ్చి
సమయు—మానవుల నాశాభయంబులను
మాచరణాంబుజస్మరణంబు మాన
కంటిపట్టెడి సూత్రమూవైభవములు!
కానిచో దాన మీకానెయ్య మేల!—
వినుము రహస్యమ్ము వివరింతు దీని:
మాయామహాదేవి మాకు రారాణి
భవము నిత్యముజేసి పరమాత్ము నెడపి
జీవులు తనుజుట్టి సేవించుపనికి
సేమింప ద్రుళ్లుదు మేమింతగాను-

కడుపార దిని యెఱుంగను కన్నులార
గూర్కి యెఱుంగ నీకోర్కిలో దవిలి-
కఠినుడ నన్నింత గాసింప జన్నె?—
కల్లరి! నీశుభాకారంపుదీము
గఱచుటిల్లుటకె నీక్రొర్యాంబకముల!

(మఱియు నాలోచించుచు)

శాపోక్తులను తామసపు బ్రజ్ఞలనుము
జ్యోతిష మను వట్టియనుమాన మనుము
నమ్మినహితకాంతు నట్టిట ద్రోసి
పరమసాధ్విని ధర్మపత్ని వంచించి
పశువ వై యింద్రియపారతంత్ర్యమున
వ్రణమట్లు జగదీశ్వరత్వమ్ము రోసి
తరుణికై ధర్మమాతను గాలదన్ని
చిరభద్రములగాంచి జీవింప దలతొ!
ఆరటవెట్టితి వాదేవసతుల
జేజిక్కుసిరిఁ జెంది చేతులారంగ
నాశమునకు విత్తనము జల్లుకొంటి
వాతొర్పుకత్తెమాయల జిక్కుకొంటి
వదిపెట్టు లంచంపుటతిపయే నీకు
నీవారలకు నిప్పు నెరు సౌను చూడు!!

(మఱల నాలోచనముగా రంగమంతటను దిరిగి, నిష్క్రమించును.)

---

ద్వితీయాంకము - పంచమరంగము.

---

పూర్వోక్తస్థలము.

(ధూళిధూసరములై జడలుగట్టినకురులు విరియబోసి, భర్తవిడనాడిననాటిచీరె గట్టి కృశాంగియై, యతిదీనాస్యయై వెడవెడచూపులు చూచుచు నువ్రత సాలోచనముగా బ్రవేశించి, రంగము నొకదెసనుండి మెల్లగా నడచి నడచి, రంగమధ్యమున నిల్చి, కొంత యోచించి)

గాని యర్హత లెట్లు గల్గు లేకుండి?
తగుదునే నిష్ఠుసదయ వేడలేదు
కాని యాచితిమై నిదానించి యెంచు-
అపరాత్పరున్నై హితకాభాసమైన
ధర్మమె సర్వభద్రముగా భజింపు-

సుప్ర:—(స్వగతం) చబాష్! లోకమంతటికిని హితబోధ జేసినావమ్మా! భవ్యశీలా, కాలము వెదపుచ్చకు. నన్ను నియమించితేని, నిహపరసాధకంబులైన యీమహా సూక్తుల సన్మానింతును—సౌందర్యము మాటటుంచి!! నియమింపకున్న నేమి? నాథుని కితరబుద్ధి పుట్టకమున్న, చేతనుండి ఫలమొడిసి తీసికొని యీయమ కిచ్చివేతునా? కాని పద్ధతి మీఱరాదు. మఱియు నాప్రాణవల్లభునొద్ద నౌచిత్యభంగభయ మెన్నటికిని లేదు. ముల్లోకములందును గూడ నాభవ్యశీలునికిం గల యింగితజ్ఞానసంపత్తి మఱెవ్వరికి గలదు?

ప్రో:—(చిఱునగవులోను వలపుచూపులలోను ననునయాలాపములలోను దఱికి వచ్చి నిల్చి)

క్రమ మెడలించి మన్కి భవకంటక—మీశ్వరభక్తిముక్తియ
ట్లమరు రసాస్థనై హితశుభావధి నిండెది వాసినన్ భవా
ర్ధము పొలివోవు—పూర్ణరసపుష్టవు నీకు విరక్తు లేలొకో!
సుమసుకుమార నీకు దగు సుందరి దెత్తు భుజింపుమాస్థమై.

ప్రి:—దేవకాంతలు ప్రసంగించునంత సేపును దదేకదీక్షతో నొకరితరువాత నొకరిని సౌందర్యపరిశీలనాపేక్షచే బరికించి పరికించి, (ప్రోజ్వల నుద్దేశించి, ఫలమామె కందిచ్చుచు)

నగుమొగంబు మృగము నగమును వలపించు
శుభకటాక్ష మట్టె సుమము దాకి
కందువర్తులాంగికముల యీనవకంబు
బల్మి గెల్చికొనియె ఫలము నన్ను!!

(హీర కన్ను లెఱ్ఱజేసి చూచుచు, సుమేధతో నొకవైపున నిష్క్రమించును. ప్రోజ్వల మఱియొకదెస ఫలము జేకొని నిష్క్రమించుచుండగా బ్రియదర్శను డామె దవిలి యావు వెన్నంటిచను లేదూడయు ట్లొడలు మఱచి నిష్క్రమించును. సుతప్ర

తానున్న పొదఱింటి వెడలి రాబోవువేళ, ఫలము బ్రోజ్జ్వల గెల్చికొన్నందుకు నివ్వెఱ పడి మూర్ఛిల్లును)— (తెఱ)

(సమరప్రియ ప్రవేశించును)

స:—ఇప్పటికి నాయభీష్టము సంపూర్ణముగా ఫలించినది. నాకపకృతి యొనర్చిన విరోధులకు దగిన శృంగభంగము నేడు పూర్తియైనది. మా గర్వించినది, నేనే గదా గంధర్వలోకాధీశ్వరినని! నరులయేగాక సాటిబృందారకులయు ఖేదమోదములకు దానే మూలకారణము నని!! నాడు నేస్వర్ణచూతము విసరినది మొదలు, రేయుం బగల్లు అనుక్షణమును దానిస్వీకరించుటకై పన్నినపన్నుగడలకు లెక్కయున్నదా? అదియే నిద్రాహారములు. అదియే యుచ్ఛ్వాసనిశ్వాసములు. అంతయు నేటితోసరి! కామితార్థభంగముతో గర్వభంగ మైనది. అందులో నొకనరాధముని చేత!! నాయహంకృతిని జక్కగా సమర్థించికొంటిని. (ఇంచు కాలోచించి) కాని యింతటితో దీరలేదు. ఇంకను చాలగ్రంథమున్నది. నాకో పాగ్నికీలలచే వేల్పుతెరవల దుర్మదారణ్యము భస్మము గావించి, వారినాశ్రయించిన మానవకీటకముల సపుత్రమిత్రబాంధవముగా నొకనినంటి యొకని మాడ్చి మసిచేసెద. రాజ్యముల నొక్కొక్కటిని బండుటాకులట్లు రాలించెద. ముల్లోకములను గుంకటిప్రేళ్లతో బెల్లగించి బంతులట్లు తలక్రిందుగా నాడించెద.

(పండ్లుకొఱికి, గట్టినిట్టూర్పు నిగుడించి, కన్నులెఱ్ఱజేసి యొక్కతడ వుండి నిష్క్రమించును.)—

---

## ద్వితీయాంకము - చతుర్థరంగము.

---

పురోద్యానస్థలము.

(విష్ణుభట్టు ప్రవేశించును.)

వి:—(దీనుడై, సాలోచనముగా రంగమం దిటునటు పచారుచేయుచు నొకచో దన్మయుడై నిలుచుండి)

చలిమలలో వల జదలేటితటుల
సంద్రంపుటిసుకల జరమాద్రిశిఖల
విహరించు చందలి విభవమ్ములరసి

ప్రకృతి కేలూతను పరమాత్మ జేరి
మైమఱచెడివేళ మఱువవు నన్ను -
ఇరుమేన వెలసిన హృదయంబటందు
వరుసుమంత్రులమందు వర్ధాంగమందు!

(ఇంచుకాలోచించుచు పచారు చేయును)

కనినన్ను, కనకనిన్ గవలట్టు లమ్మ
పాలను ప్రేమను బాలిచ్చి పెంచు
టాదిగా; బుద్ధుల నలరించి తండ్రి
పల్కుల మహనీయభావార్థములుగ
గఱపినదాదిగా గడలేని కూర్మి
సరితోడునీడవై జతగూడి యొక్క
నిమిషార్థ మెడబాయనేరవు నన్ను!

(మఱల నించుకాలోచించుచు దిరుగును.)

భోజనంబుల రత్నభాజనం బగుచు
విహరణముల ధర్మవేత్రంబ నగుచు
లోకము దెలియ సులోచనం బగుచు
భోగంబులకు మనోఽభోగంబ నౌచు
ముచ్చటపడి నెయ్యమును గూర్చికూర్చి
హితవున జిరసౌఖ్య మెచ్చించి నవ్వ
టోలల దేలించి, తూలించి సంత—
బ్రతుకు గానమునను శ్రుతివైన నన్ను
విడచి యేకత మెట్లు వెడలితి వాక్కా!
మురిసితి నీభవ్యమూర్తి నీక్షించి
భ్రమసితి నీతేనె పల్కు లాలించి
పొంగితి నీకల్మి బొరిపొరిం దలచి
తనువిద్దఱమటంచు దర్పించి కొంటి
నడియాసగొని త్వమేవాహమ్మటంటి—
నరయ జెల్మి ప్రయోజనాంతమ్మటంచు!
ఆర్నెలలాయె నీయానవా లెఱుగ
వింధ్యాద్రిపతియాన వి శ్వేశునాన!

స్వర్గభ్రాంతి నొదవించుచు, విచ్చలవిడి వనవిహారముజేయు మరుత్కుమారుని వలపు చక్కిలిగింతకుం బులకించి సుమాశ్రువులు గురియు పొగడజొంపపురొద విని నాప్రాణనాయిక ధరించు బెట్టుకట్టుపుట్టంపుకుచ్చెళ్ల రొద యని భ్రమసితిని. ఎడకాడ వర్ధిల్లు పారిజాతమల్లికామాలతీనికుంజములందుండి ప్రసరించు నవ నవసౌరభతరంగము లాని, కుసుమగంధియగు నాకోర్కులబరణి దరియుచున్న దని త్రుళ్లిపడి లేచితిని. సమస్తజీవకోటులు దేహాము మఱచి మఱపించి, తిన్నగా జిత్తములో గత్తుగలిపి యల్లిబిల్లిగొను నీచల్లదనము రోమరోమము వెంబడిని గ్రోలుచు, హర్షపారావారనావికుండగు మనోభవు నాశ్రయించి, తత్సమ క్ష్యామంత్రములా యనందగు హృదయంగమవిహంగమకిలకిలారావంబు లోక ప్పడు నామనోహారిణి స్వర్ణకింకిణీనూపురారావ మనుకొంటిని. రాత్రి మూడవ యామము సమీపించుచున్నది. ఇంకను నాదక్షిణ రాకున్నది. ఎట్టియంతరా యము తటస్థించినదో! ఇంతకాలవిలంబము శుభచిహ్నముకాదు. అర్ధరాత్రము కాకముందే నన్ను జేరుదునన్నమాట నెరవేర్పమికిం గారణము స్వవశమైయుం డదు. (అట్టె దవ్వునరయుచు) అదే వచ్చుచున్నది. హృదయమా, ఆరాటము స్వీడుము. అయ్యో యీడు శతానందుడు-ఏమి కబురు తెచ్చువాడోకదా!

(శతానందుడు ప్రవేశించును)

ఏమోయి, నీకొఱకు నిరీక్షించి కన్నులు కాయలు కాచినవి. ఏదీ మీమహాదేవి యెక్కడ? భోజనమే తడవుగా నిచ్చట ప్రవేశించితిని- అదిమొదలు-

శ:—అబ్బబ్బ! ఇస్స! (అని అలయిక నటించుచు చదికిలబడి కూర్చుని) చేతులు వెను కసానుకొని తలవెనుకకు జాచి నిట్టూర్పునూర్చుచు) మీప్రణయాలు బంగారం గానూ, నాకణత తెగిరిపోతూన్నాయి. విషంతాగినట్టు గుండెలు మండుతూ న్నాయి. అయిదురాత్రులనుంచిమీయిద్దరిమధ్యనూ మగ్గంలోకండెలాగ తిరగడం తో సరిపోయింది. పగలు పడుకుందాం అంటే కన్నుపొడుచుకున్నా రెప్పవా లిందికాదు. మీతాపత్రయాల్తోటే సరిపోతూంది నాబతుకంతా. అదేం జన్మ త్తేనోగాని-

ప్రి:—మీమహాదేవి యెక్కడ?

శ:—తోటంతా వెతుక్కు చచ్చాను. గట్టిగా పిలిస్తే తంటా- అందుచేత చీకట్లో అర్ధరాత్రివేళ ప్రాణానికాశించక పాముల్లో పామునై, పిశాచాలకి పిశాచాన్నై-

ప్రి:—నే నింకా నిరీక్షింపవలసియున్నదా లేక-

సుప్ర:—పలుకులపాయసంబు నిరపాయసుఖావధి మంగళార్ణవం
బెలమికి వేగుజుక్క రుజకిందనినవ్యరసామృతంబు నా
వలపులపావురంబు బలవద్విధివంచన బాసి చన్న నే
దలకక మృత్యుమారినయి తాల్చితిగా మగఱాలిగుండియల్ !!

అయ్యో, నేబ్రదికి యేమి చరితార్థము? కన్నుబొడిచి కంటిపాప నూడదీసికొని పోవుసాహసకర్త్రిల నడ్డగింపలేకపోతిని. ఇంతకాలమై యెడబాసినవల్లభుని దిగిగి కౌగిటకు మఱల్ప లేకపోతిని. దైవమా, నాభవ్యశీలుడెందు నెట్లు శోభించుచున్నాడో కదా! ఆక్రూరయక్షిణీకాంతలు నావిశ్వమోహనుని కేళికాకందుకము ట్లాత్మ వినోదమునకై యేయిదుమలకు బాల్సేసినారో! నే నేమిసేయుదు? ఎచ్చట నున్నాడని నిర్ణయింతును? (అస్వస్థతతో నొకమాఱు చెక్కిలిక్రింద జేయి పెట్టుకొనియు, మఱియొకపరి కన్నులుమూసి తలయూరగిల బైకెత్తియు, నింకొకతరి చేతిని బైకెత్తి తర్జని బంటగఱచిపట్టియు నాలోచించి, నిశ్చయించి, యించుకలగి, మఱల నిష్ప్రహాతనొంది, కొంతవడికూర్చుండి, యంతట దటుక్కున లేచి నిలువబడి తొట్రుపడి) నదీమతల్లి యగు నాతల్లికన్న నాకుం గూర్చువారు లేరుకద! అట్టిసంపూర్ణవత్సలకూడ నన్ను దరంగహస్తములచే గొత్తిపట్టి యాత్మహత్య గావించికొనవలదని యాకాశవాణిగా శాసించి తనగర్భశోకమే దక్కించికొన్నదికాని తనయమానుషమాహాత్మ్యముచే నాకు బలిభిక్షమిడి యాతీవ్రవేదన నివారించి నన్నుద్ధరించినది కాదయ్యెను. లోకమంతటికి నిజే మచ్చు-ఈలోకము నమ్మరాదు. ఇతరులసహాయసంపదలన్నియు వట్టి మరుమరీచికలే-పురుషకారమే నిశీథాంధాన్వేషణము-అదయామయులైన భాగ్యదేవతల చరణములు దక్క వేఱుశరణము గాన్పింపకున్నది.

(చేతులు జోడించి నిన్నయదై)

కులదైవతములార గురులారసురలార యర్కేందుతారాగ్రహంబులార
సృష్టి నెల్లెడ నిండి శ్రేయంబులని మేఘదృక్కోటి గురియించు దివ్యులార
తనువిచ్చిమిముమాకుదావలముజుడిచ్చె-గాకున్న నథ్వానగహనమిహము
కనుతెప్పఁట్టులిందనుక నన్నెంచిన దయనూట హెచ్చింప దరుణమయ్యె

నూనితే అని వారం రోజులు కాలేదు వాళ్లిల్లు గుల్లచేసింది. మరోటీ, రోజూ యిది వొండడం వాళ్లకి పనికిరాక గోతులో పొయ్యడం—

ప్రి:—(తనచేత నున్న వజ్రపుటుంగరము వానివ్రేలికి దొడుగుచు గెడ్డము నొక్కి బ్రతిమాలుచు) నామాటకు ప్రత్యుత్తరం చెప్పవూ?

శ:—నీమాట యేమిటి?

ప్రి:—దక్షిణాదేవి యిప్పు డిటకు వచ్చునా?

శ:—నాకేం తెలుసును?

ప్రి:—నీవామెయొద్దనుండి రాలేదూ?

శ:—ఎవరివద్దనుంచి?

ప్రి:—దక్షిణమేడనుండి-

శ:—ఆ- ఆవిడమేడపక్క వసారాదిగువ మండువాలోంచి వచ్చాను.

ప్రి:—ఆవిడను చూచావా?

శ:—ఆమండువాకు పడమటిసావిడిదిగగా నేజనానా నాఖర్ల కాపరపుగదులు-వాటికి చేర్చి పెద్దపెరడు- అందులోవే ఆరొందు తియ్యమావిడి చెట్లున్నూ. ఒక్కొక్కటి రెండేసివందల సంవత్సరాలవి. ఆపెరటికి దక్షిణాన్నే వంటిళ్లూ పశువులసాలా పెద్దతులసికోటాను. ఆపైని మాలోగిలి.

ప్రి:—అందుండి నీవు తెచ్చినకబు రేమి? నన్నుండుమన్నావా, పోయి బసలో పడుకొమ్మన్నావా?

శ:—నీకు నిద్దరొస్తూందా- నిద్దర్రాకపోతే పడుకోకు. నాసొమ్మ్యం- అవుతుంది.

ప్రి:—నీసొమ్మ్యం మండిపోనూ! దుర్మార్గుడా, ప్రాణహాని చేస్తూన్నావురా నాకు!!

శ:—అమ్మగారి అరణపు నౌకరుని-ఆవిడతాతగారూ నేనూ వొక్కరోజున పుట్టేము- వారివొడుగునాడు వొడుగూ, పెళ్లినాడు పెళ్లీ చేశారు నాకు- మా మహారాజులుం గారికి అఖండకటాక్షం నాయందు. ఆయనవద్ద నాకున్న చనువు భార్యతోవచ్చిన పెద్ద అరణపుదాసీకికూడా లేదు. యీపిల్లపుట్టేటప్పుడు చుట్టుపట్ల పన్నెండురాజ్యాలంట రక్తవర్షం కురిసింది. ప్రళయం వదుతుందా అన్నంత ఉరుములూ, మెరుపులూను- దానితేజస్సు ప్రళయాగ్నిజ్వాలల్లాగ అన్నిదిక్కులా వ్యాపించింది అన్నట్టు జ్ఞాపకం వచ్చింది. నువ్వు తోటలో వున్నావోలేవో చూసిరమ్మంది. వేగిరం రమ్మంది. లేకపోతే పిలకపట్టుకు గాడిస్తుంది. ముస్తాబై కూర్చొన్నారు [illegible] నన్ను పకు-పోవాలి.

శ్రీరస్తు.

# స్వర్ణచూతము

## తృతీయాంకము - ప్రథమరంగము.

---

(పాంచాలదేశరాజగు రణసింహుని రాజధానియైన యహిచ్ఛత్రమందలి యుద్యానము. ఫలపుష్పభరితములై వంగినతరులతానికరములచే మూయబడి పూర్ణచంద్రాతపపునీడలచే సగము చీకట్లుగొన్న తెల్లని చంద్రకాంతశిలావేదికెదుట పచ్చికపట్టుపై గూర్చుండి, ఓపిక నిలుపలేక యొకపరి లేచి తిరుగులాడుచు, ఇంకొకపరి యెదుట తెన్నులను తదేకదీక్షగా నిలువబడి ప్రతీక్షించుచు, నింకొకమాఱు త్రుళ్లిపడి యేదో యొకచప్పుడు విన్నట్టు తటుక్కున వెనువిరిగి వంగి తొంగిచూచుచు, ఆశాభంగవశమున దొందరపడి యొడలు మఱచి యరుగుపై గూర్చుండి, మఱల తక్షణమే లేచి పచారుచేయుచు, విసుగుగొనుచు, బ్రియదర్శనుడు ప్రవేశించును.)

కాలము అర్ధరాత్రము-

ప్రి:—(కూర్చొని తలయెత్తి పంకించి)

కోరి సేవింపనరుదారు; నూఱకున్న
జరణముల చెంత కొక్కొక్క జయము దెచ్చు:
బిలువ దాఁటేటి తేరెక్కి నలసు సేయ
బవనజవమునబైవ్రాలు నవసరంబు-

ప్రియురాలి నిజస్వరూపముకన్న మనోగతస్వరూపమే హాయిగా దోచుచున్నది. తద్భ్రాంతి చిత్తమునంటిపట్టి పరాయత్తము గావించినట్టి తద్దివ్యమంగళవిగ్రహము భవతాపనివారకమగు తత్కటాక్షాసారము, తత్సుధామయవచోవిలాసమైనను జేసియుండలేదు. ఉండియుండి కలలో నించుక తెల్వివచ్చినట్టిది భ్రాంతియని జ్ఞప్తికి వచ్చినప్పుడు గదా, ససంభ్రమవిషాద మావహిల్లుచున్నది! అంతవఱకును దన్మనమే పరమసుఖ మగుచున్నది. బుద్ధీంద్రియములన్నియుం దన్మయమై నివాతస్థదీపమువలె మనస్సు బ్రహ్మానందభాజన మగుచున్నది. సచరాచరప్రపంచమంతయుం దల్లీనమై, తదాభాసమై కనిపించుచున్నది. జగదానందకరుడగు సుధాకరునకుం గుసెచ్చెలియై, భూలోకమందు

స్వర్గభ్రాంతి నొందమించుచు, విచ్చలవిడి వనవిహారము జేయు మరుత్కుమారుని వలపు చక్కిలిగింతకుం బులకించి సుమాశ్రువులు గురియు పొగడజొంపపుదొంద విని నాప్రాణనాయకి ధరించుబెట్టుపట్టుపుట్టంపుకుచ్చెళ్ల రొద యని భ్రమసితిని. ఎడనెడ వర్ధిల్లు పారిజాతమల్లి కామాలతీనికుంజములందుండి ప్రసరించు నవనవసౌరభతరంగము లాని, కుసుమగంధియగు నాకోర్కులబరణి దరియుచున్నదని త్రుళ్లిపడి లేచితిని. సమస్తజీవకోటులం దేహము మఱచి మఱపించి, తిన్నగా జిత్తములో గత్తుగలిపి యల్లిబిల్లిగొను నీచల్లదనము రోమరోమమువెంబడిని గ్రోలుచు, హర్షపారావారనావికుండగు మనోభవు నాశ్రయించి, తత్సమర్చామంత్రములా యనందగు హృదయంగమవిహంగమకిలకిలారావంబు లోకప్వడు నామనోహారిణి స్వర్ణకింకిణీనూపురారావ మనుకొంటిని. రాత్రిమూడవ యామము సమీపించుచున్నది. ఇంకను నాదక్షిణ రాకున్నది. ఎట్టియంతరాయము తటస్థించినదో! ఇంతకాలవిలంబము శుభచిహ్నము కాదు. అర్ధరాత్రము కాకముందే నన్ను జేరుదునన్నమాట నెరవేర్పమికిం గారణము స్వవశమైయుండదు. (అట్టె దవ్వునరయుచు) అదే వచ్చుచున్నది. హృదయమా, ఆరాటము న్విడుము. అయ్యో! వీడు శతానందుడు-ఏమి కబురు తెచ్చువాడోకదా!

(శతానందుడు ప్రవేశించును)

ఏమోయి, నీకొఱకు నిరీక్షించి కన్నులు కాయలు కాచినవి. ఏదీ మీమహాదేవి యెక్కడ? భోజనమే తడవుగా నిచ్చట ప్రవేశించితిని- ఆదిమొదలు-

శ:—అబ్బబ్బ! ఇస్స! (అని అలయిక నటించుచు చదికిలబడి కూర్చుని) చేతులు వెనుకనానుకొని తలవెనుకకు జాచి నిట్టూర్పునూర్చుచు) మీప్రణయాలు బంగారంగానూ, నాకణత తెగిరిపోతూన్నాయి. విషంతాగినట్టు గుండెలు మండుతూన్నాయి. అయిదురాత్రులనుంచిమీయిద్దరిమధ్యనూ మగ్గంలోకండిలాగ తిరగడంతో సరిపోయింది. పగలు పడుకుందాం అంటే కన్నుపొడుచుకున్నా రెప్పవాలిందికాదు. మీతాపత్రయాల్తోటే సరిపోతూంది నాబతుకంతా. అదేం జన్మత్తేనోగాని-

ప్రి:—మీమహాదేవి యెక్కడ?

శ:—తోటంతా వెతుక్కు చచ్చాను. గట్టిగా పిలిస్తే తంటా- అందుచేత చీకట్లో అర్ధరాత్రివేళ ప్రాణానికాశించక పాముల్లో పామునై, పిశాచాలకి పిశాచాన్నై-

ప్రి:—నే నింకా నిరీక్షింపవలసియున్నదా లేక-

శ:—యీవేళ యెండంతా నాకోసమే కాసింది. మంగలంలో పడేసినట్టు వేగిపోయాను. చాల్రా దేవుడా! ఏమైతే అయింది, సాయంకాలం కొంత చల్లబడింది, రెండు మెతుకులు నోట్లో వేసుకుని వొకమాటు వొరిగి మరీ యీసుడిగుండంలో పడదాం అంటే, యెడాపెడా చెంపపెట్లలాగ యిటు నీకబురు, అటు సూస్తే మాఅన్నగారి పెద్దకుర్రాడికీ పెళ్లానికీ షష్టాష్టకం- ఏపని విడిచిపెట్టను? పోనీరా, వారికాళ్లూ వారికాళ్లూ పట్టి గణించేవాణ్ని నేనూరుకుంటే, నీపెళ్లాం యెవళ్లకి పెడితేయేమిరా అంటే దానిపుట్టింటివాళ్లకీ వాడికీ, యీనాటిదా, ఆవైరం? మన్లోమని మాటసుమీ, వాళ్లు కొంచెం స్తితితక్కువ్వాళ్లు. వాళ్లకంతా చాలా వుంది- మనంతపరువు ప్రతిష్ఠలు గలవాళ్లుకారు. సంసారం వో పెద్దబరువు కాదంటే- యెవళ్లకైలే యేమిటి? నామాటమాత్రం యేమిటి. నువ్వోకంటితో కనిపెడుతున్నావు గనుక కాని—అజీతపురాళ్లనా? పిట్టని గొట్టా, పొయిలో పెట్టా-

ప్రి:—నాయనా, శతానందా, నిన్ను బ్రతిమాలుచున్నానురా! అపతల తెల్లవారిపోతూంది. ఒక్కమాట—దక్షిణ నేడిక్కడికి వచ్చునో లేదో చెప్పి నన్ను కృతార్థునిజేయరా!

శ:—యెవరితొందర వారిదే. మాపెద్దాడిసంగతి నాకు వళ్లు పెరుగూ గుచ్చెత్తి గొంతుకులో పోసుకున్నట్లున్నది. మాఅన్నయ్య పోవడం, నాకు పిల్లలుపుట్టనూ చావనూ కదా- భూమి అంతా మెరకచేశాను. వీడిమీదాశలన్నీ పెట్టుకొని యెప్పుడో వీడుద్ధరిస్తాడని, వంశం నిలుపుతాడని-అసలు యీవంశకర్త హరిదాసు. ఆయన నాడు చంటిపిల్లకు ముక్కుకుట్టించి సంభరంచేస్తే మాబంధువులు నలుగురూ కలిసి నొక్కమాటు భోంచేయడానికి మాసావిళ్లు చాలేవి కావు. అంతటి కుటుంబం యింతకు దిగిందిగదా, నాయనా!—(ఏడ్చును).

ప్రి:—నీవు రాకముందు మీదేవిగారిని చూచావా?

శ:—మేనరికం చేస్తాన్రా, సుఖంగా పాఫరప్పిట్టల్లాగుండ్రా నాయనా అంటేవిన్నాడు కాడు. తల్లీ నేనూ శతపోరియాం- ఆతల్లికి వాడియందు కేవలం పుత్రప్రేమే! అయితే సరియా? యీమధ్యను మావూళ్లో బ్రాహ్మణది వకత్తె పుట్టింటినుంచి అత్తారింటికెళుతూ బండివాణ్ణి మోహించి పెళ్లాడేసింది. సరే- వాడూరుకుంటాడూ? చచ్చినట్టింటికిరా ముండా, నాకూనా తల్లికీ సంరక్షణచేయి,వండిపెట్టన్నాడు. దానికి వాళ్లవంటలు చేతగావు. చలిమీదికి నెయ్యిలేే, పొగుపులో!

నూనితే అని వారం రోజులు కాలేదు వాళ్లిల్లు గుల్లచేసింది. మరోటి, రోజూ యిది వొండడం వాళ్లకి పనికిరాక గోతులో పొయ్యడం—

ప్రి:—(తనచేత నున్న వజ్రపుటుంగరము వానిప్రేలికి దొడుగుచు గెడ్డము నొక్కి బ్రతిమాలుచు) నామాటకు ప్రత్యుత్తరం చెప్పవూ?

శ:—నీమాట యేమిటి?

ప్రి:—దక్షిణాదేవి యిప్పుడిటకు వచ్చునా?

శ:—నాకేం తెలుసును?

ప్రి:—నీవామెయొద్దనుండి రాలేదూ?

శ:—ఎవరివద్దనుంచి?

ప్రి:—దక్షిణమేడనుండి-

శ:—ఆ- ఆవిడమేడపక్క వసారాదిగువ మందువాలోంచి వచ్చాను.

ప్రి:—ఆవిడను చూచావా?

శ:—ఆమందువాకు పడమటిసావిడిదిగగా నేజసానానౌఖర్ల కాపరపుగదులు-వాటికిచేర్చి పెద్దపెరడు- అందులోనే ఆరొండు తియ్యమావిడి చెట్లున్నా. ఒకొక్కటి రెండేసివందల సంవత్సరాలవి. ఆపెరటికి దక్షిణాన్నే వంటిళ్లూ పశువులసాలా పెద్దతులసికోటాను. ఆపైని మాలోగిలి.

ప్రి:—అందుండి నీవు తెచ్చినకబురేమి? నన్నుండుమన్నావా, పోయి బసలో పడుకొమ్మన్నావా?

శ:—నీకు నిద్దరొస్తూందా- నిద్రరాకపోతే పడుకోకు. నాసామ్యం- అవుతుంది.

ప్రి:—నీసామ్యం మండిపోనూ! దుర్మార్గుడా, ప్రాణహాని చేస్తూన్నావురా నాకు!!

శ:—అమ్మగారి అరణపు నౌకరుని-ఆవిడతాతగారూ నేనూ వొక్కరోజున పుట్టేము- వారివొడుగునాడు వొడుగూ, పెళ్లినాడు పెళ్లీ చేశారు నాకు- మా మహారాజులుం గారికి అఖండకటాక్షం నాయందు. ఆయనవద్ద నాకున్న చనువు భార్యతోవచ్చిన పెద్ద అరణపుదాసీకికూడా లేదు. యీపిల్లపుట్టేటప్పుడు చుట్టుపట్ల పన్నెండురాజ్యాలంట రక్తవర్షం కురిసింది. ప్రళయం పడుతుందా అన్నంత ఉరుములూ, మెరుపులూను- దానితేజస్సు ప్రళయాగ్నిజ్వాలల్లాగ అన్నిదిక్కులా వ్యాపించింది అన్నట్టు జ్ఞాపకం వచ్చింది. నువ్వు తోటలో వున్నావోలేవో చూసిరమ్మంది. వేగిరం రమ్మంది. లేకపోతే పిలకపట్టుకు జాడిస్తుంది. ముస్తాబై కూర్చో[illegible] నన్ను పట్టుకు-పోవాలి.

ప్రి:—ఆఁ ఆలాగునా? అయితే వేగంగా వెళ్ళి యిక్కడ నున్నానని చెప్పు - (మెడ లోని ముత్యాలహారము దీసి వానిమెడలో వేయును.)

శ:—అన్నన్న! (లేవబోయి చదికిలబడి) యీ మోకాళ్లు వాతప్పట్లుకావండీ! యీతిర గడంతో నాపని సరి. కుర్రాడికీ రోంతాధారం లేకుండా చేస్తున్నారు. మీ రిద్దరూ కలిసి-

ప్రి:—(లేవదీయుచు) నిన్నుతీసుకొని తోటచివర దిగబెట్టెదను—రా. తిరిగి త్వరగా రావలెను సుమీ.

శ:—ఇప్పుడే తీసుకొస్తా చూడు. ఇదుగో యిక్కడ మనం వుండొద్దు. యిదే సమయం రాణీకీ మొగుడికీ మాటల్లేవు. ఎవరితోటి చెప్పొద్దంది. యెవత్తినో తీసుకొచ్చి పడతాగి వారం రోజుల్నించి లోపమేళ్లోనే వున్నాడు. మాకుర్రాణ్ని పోషిస్తా నని నానెత్తిమీద చెయ్యేయ్యి-

ప్రి:—నీకేసంశయం వద్దు. నాయొద్ద పెద్దసర్దార్‌గా తీసుకొంటాను. నాకు రాజ్యం వచ్చినప్పుడు దివాన్‌గిరీ యిస్తాను.

శ:—మానాయన! మానాయన! నా అదృష్టం బాగుండాలి నీకు రాజ్యం రావడానికి (నిష్క్రమించును).

ప్రి:—ఇప్పటికి నాయలజడి తగ్గినది- కాని యెందుకింతసంశయ పడితిని? దేవతావర ప్రసాదము పరిపూర్ణముగా నాయందు కలిగియున్నది. (అంగీక్రిందనున్న వజ్ర కటిబంధము దడవి చూచుకొని) ఇష్టదేవత తనప్రతినిధిగా నీకటిబంధ మిచ్చి దీన గోరినయెడవతులెల్లరు వశమగుదురని యభయమిచ్చె. కాలదికిమీరిన కష్ట ము తటస్థించినపుడెల్ల దన్ను దలచుకొన్నమాత్రాన బ్రత్యక్షమగుదునని వరమిచ్చె. ఐనను స్వతస్సిద్ధమైన మానవదౌర్బల్యము వదులుటెట్లు? ఎన్నివరముల నేపట్టిన నేమి- విధి యొనర్చుమాయ లవాఙ్మానసగోచరములు. సర్వవిధములను బ్రసాదింప నుంకింపదేని నేదోయొకవిఘ్నము సమకూర్చి పౌరుషమంతటిని నిష్ఫలము గావించును. ప్రయత్నాన, మనశ్రేయస్సు మనచేతులార గూలద్రోయించును. కార్యసిద్ధి గానుండనపుడు మనవరములు మనకే శక్తికిరావు. మనదైవముపై మనకే పరాకు పుట్టును. కార్యము మించినతరువాత దేవతలను, వరములను దల చుకొని అయ్యోయని లేనివానికంటె వేయుమడుగులు శోకించుటకు గారణము లగును. వరములిచ్చుటకును, ఇచ్చినవరములు వినియోగ మగుటకును గూడ దైవమే కర్త. మానుషమొకటిగవేతు మారదు-మారదు-కాని హా! హా!

ప్రబలదై వంపు వెల్లువ బడి మునింగి
తేలి గిజగిజవడు చెట్టలల కొక్క
కదులు స్వాధీనమగుమాత్ర గావరించి
రాలిపడు దానె సృష్టికి మూల మనుచు!!

(శతానందుడు తొందరగా ప్రవేశించును)

శ:—(కన్నుసన్నలచే దనవెనుకనుండివచ్చు దక్షిణరాక నెఱింగించుచు) నే నెంత కష్టపడ్డానో నీకక్కర్లేదు- నీపని నీకాకపడమే ప్రధానం కాని—
(ప్రియదర్శనుడు ససంభ్రమముగా లేచి యొడలు సవరించికొని యెదురేగు నంతలో దక్షిణ ప్రవేశించును.)

శ:—నీకోరిక సిద్ధించింది. మావాడి దివాన్‌గిరీమాట మరచిపోకు-ఇకనాఅవసరంతీరింది. మీరూ మీరూ వకటే. ఇదివరకున్న ధైర్యం యిప్పుడు లేదు నాకు (నిష్క్రమించును).

ప్రి:—ఏదో అడ్డమువచ్చినదనుకొని మాతొట్రుపడినాను.

ద:—నేను నట్లే భ్రాంతిపడినాను. శతానందుని యాలస్యము జూచి- కాని యెంతో రాత్రి కాలేదు. మఱి యొకసారి స్వస్థచిత్తులమై యాలోచించి యీామహా సమయమును భావిఫలసంకీర్ణముగ జేసికొనదగును.

ప్రి:—మనమిచ్చటనున్నంతవఱకును మనకు శాంతి సమకూరదు. సమయానుకూల్యము కొలదిని వేగముగా నాతండ్రిగారిరాజధానికి మనమేగినంగాని దిగ్విజయ మనిపించుకోదు.

ద:—ఏగిన తరువాత మనకు స్వస్థత యెక్కడిది? మనమనరాజ్యాధిపతులకు ఘోర యుద్ధము తప్పదు. అందు నిలువగలిగిన బలాబలములను లెక్కించికొని మఱి యీసాహసమున కాయత్తపడవలెను.

ప్రి:—నాతండ్రియుం, నన్నలును మహాపరాక్రమశాలురట. ఇదివఱకు నే బ్రచ్ఛన్నముగా నున్నాను. కాని యొకయేడాదిక్రిందట నేబెఱిగిన దేశమునుండి యిటకు దోడ్కొనివచ్చుచు నాయిష్టదైవమగు ప్రోజ్జ్వలాదేవి నాజన్మవృత్తాంతమంతయు నాకు వినిపించినది. నాయందు జననీజనకులకు బరమవాత్సల్యమట. నీ సౌభాగ్యసంపదజూచియేమి, చిరకాలవాంఛితమగు నాయాగమనము జూచి యేమి, మనపక్షము లోకమంతటితోను సమగ్రింపగలరు.

ద:—ఈపక్షమున నేజన్మించినపుడు నాయపూర్వలావణ్యముం జూచియు, నప్పటి

కొన్ని నిమిత్తములం బట్టియు, నాజనకుడు దిక్పాలురవంటి మహావీరులగు పదుగురుసాటిరాజ్యాధిపతులను దనయనుంగుమిత్రులను రావించి యెప్పుడైన నా విషయమై యుద్ధము సంభవించెనేని సమస్తరాజ్యాంగబలసమేతులై నానహాయమునకు వెడలివచ్చునటుల వారిచే బ్రతిజ్ఞ జేయించెను. ఇప్పుడు నామాన సంరక్షణార్థమై వారందఱు తరలివత్తురు. భీమార్జునులంబోని ధనుర్ధరులైన సుతులిర్వురిలోను మామగారు గజాశ్వపదాతిసైన్యములతో దండయాత్రకు వెడలుదురు. అంతకును ముఖ్యాంశము మీపక్షము ధర్మ్యపక్షము. మనపక్ష మధర్మ్యము. ఆభేదము దేవమానవసహాయసంపత్తియందు గానరాకమానదు.

ప్రి:—నాకు దైవబలము గలదు. నీతగులము దేవకన్యారత్నమగు ప్రోజ్జ్వలాదేవినలన నాకలవడిన యమూల్యవరప్రసాదము దేవతాభీష్టములకు మానవయత్నములు విఘ్నము దేగలవా? ఏది యెట్లున్నను గెలుపు మనకు దప్పదు.

ద:—ఈలాగా బ్రజాక్షయమో? కీడునెల్ల బూచి భరించితిమేని, దుదకీప్రయత్నమువలన ననర్థమే పొడసూపుచున్నది. కావున మనమిచ్చటనేయుండి యిష్ట దేవతాసంరక్షణమున వీలగునంత స్వేచ్ఛతో నెప్పటియట్లు సంపూర్ణమనోరథసిద్ధిమై సుఖముందమని నామతము. కొంతకాలముండి యావెనుక దత్తత్సమయోచితముగా గార్యసాధనమాలోచించుకొందము. ఇట నున్నందున మనకు లోపించునది యొక్కస్వాతంత్ర్యమే. అక్కడ గానున్న సమరములందు బ్రాణధారణమే సంశయాస్పదముగా గాన్పించుచున్నది.

ప్రి:—చుట్టపుజాపునకు వచ్చి యిందెంతకాలము నివసింపగలను? అదిగాక నాయాశాపాశములన్నియు స్వదేశమువంక మనసు నీడ్చుచున్నవి. నేనిరువదిమూడేండ్లు బలవత్ప్రవాసమందుండి యీనాటికిలోకై కదీపాంకుగమవగు నీచెట్టవట్టి జననీజనకులయుత్సంగ మధిష్ఠించినపుడు వారి ముఖపద్మములవికాసము జూడ వేడుకగుచున్నది.

ద:—కాని మధురభోజ్యములం దిమిడ్చిన విషఘుటికయట్లుత్తరక్షణమే వారిని మనలను జుట్టుముట్టి హానిం గమకింపకున్నారు.

ప్రి:—ఏమినేతుము? తల్లిదండ్రులకును గాన్పింపక ప్రచ్ఛన్నముగా బరదేశములందు నివసింతమన్న, నేదాగినను, నీయతిమానుషరూపలావణ్యసంపదలు నిన్ను దాగనియ్యవు. నిన్నువిడచి యొక్కనిమిషార్ధము నిలువలేను. నీవు రావేని, సమరమక్కరలేకయే ప్రాణమునకు దూరమగుదును. కావున నన్ను వలతువేని, నా

ప్రాణము గాపాడదలతువేని తెల్లవారకముందు బయలువెడలి కాశ్మీరమునకు బోదము రమ్ము. ఆటంకము చెప్పక నన్ను రక్షింపు- (అడుగులపై వ్రాలును.)

ద:—ప్రాణప్రియా, నిన్ను విడచి నాకిహపరములందు గతి లేదు. ఏడాదిక్రిందట నిన్ను సందర్శించినప్పటినుండియు, నీ తేజోవిభవమును, నీవ్యుత్పత్తియును మనసార నోక్కాణూటైననేమి యనుభవింపకుంట స్త్రీజన్మకు వైఫల్యమని దినదినప్రవర్ధమానమగు ప్రణయోత్కంఠను సమూలముగా బుష్పింపజేసి క్రమముగా నా మనోధనమునకు జగదేకపాత్రమవని నీవశముగావించి, నాసుఖదుఃఖములు నీతోబాటివే యనుకొని, పరాధీన కృతార్థనైయున్నాను. సురపొన్న నెక్కిన ద్రాక్షాలత, తరుచ్ఛేదమైనపిదప నిల్చుటెక్కడ, నిల్చి యేపారు టెక్కడ? నిన్నెడబాసినక్లేశముకన్న నీసమక్షమున దేహత్యాగము లెస్స-నీతోఁ గలనైన వికటించుదాన గాను. తప్పక నేడు పయనమగుదము రమ్ము. మంచికిని జెడ్డకును నీతోజీవము దుదముట్టింప దలచియున్నాను. నన్ను విడనాడకు—

(చేతులు మెడకు జుట్టి, -సొక్కి-, యానందబాష్పములు విడచును.)

(తెర)

---

## తృతీయాంకము - ద్వితీయరంగము.

---

(పాంచాలరాజధానియగు నహిచ్ఛత్రమందలి రణసింహమహారాజుమందిరము. రణసింహుఁడును యువరాజగు యశోవంతుఁడును ఉన్నతాసనములపై ముఖాముఖిగా గూర్చుండి ప్రవేశింతురు. కాలము సాయంతనము)-

ర:—కుమారా, కరుణానిధియగు భగవంతుసివప్రసాదముచే నింతవఱకును నాభవము సార్థకమే అయినది. రాజ్యము నిరీతికమై, సంపూర్ణకామమై ప్రజకు గామధేనువుగా వర్ధిల్లుచున్నది. ఈభౌతికదేహముకూడ నిరంతరవశవర్తినియగు నీజననిచే బరిమళించి, పరమానుతంత్రుడవగు నీయందు ఫలించి, యరువదియారేండ్లు నిర్విఘ్నానతము లెఱుంగని సంతుష్టికిరవై, యఖండధన్యతాభూయిష్ఠమైనది. నీ తమ్ముడు కుశలుడే సుంత కుశలుడయ్యెనా నిష్కళంకచంద్రుడనే యగుడును.

య:—మహాప్రభూ, కుశలుడింకను జిన్నవాడు. సర్వసర్వంసహాధురంధరులైన యేలికలచాటువాడు. దేవరవారి జగద్విశాలశరీరమునకుం బ్రియసంతానమగు ప్రజకే

సంసారభారము విలాసపుష్పదామమై భోగభాజనమైనపుడు, గార్హస్థ్యపరిమిత కాయజాలమై, యవిభక్తవాత్సల్యభాగ్యభోక్తలమగు నాకును దమ్మునికిని కేవల రత్నహారప్రాయమయి తోచుట లాశ్చర్యమేమి? జిహ్వాగ్రకల్పఫలాసవమైన తల్లి ప్రాపకమున ననన్యవాంఛముగా వర్థిల్లు శుకార్భకమున కాకాశగమనాయాస ముతో బనియేమి ?-

ర:—నీయందు వర్తింపరాదూ ఆధర్మము ? వాడొక్కడే నాకీమనోవ్యథకుం గారణ మగుటేమి? కాని యది ప్రకృతాంశము కాదు. ఒకవిధాన నీక్లేశమే శుభచి హ్నమయి, పరమాత్ముని కృపాతిరేకముచే విశదీకరించుచున్నది. కుశలుడే నా కనుకూలుడై, వాని దుశ్చరిత్రమునకు నీతల్లి దుఃఖిల్లదేని, వానికా)రనిరాకరణ మునకు భార్య కృశించియుండదేని, భవమందు నేడు గలిగిన వైముఖ్యమునకు మాఱు నిరంతరవ్యామోహము కలిగి పరాత్పరు సేవను మఱచియుందునేమో.- దీర్ఘదృష్టితో జూడ భవక్లేశమే పరమార్థసింహద్వారము ట్లగుపించుచున్నది.

య:—స్వామీ, మనమంత శోచింపవలసినపని లేదు. మఱొక్కింత లోకానుభవముతో దమ్ముడు మీచిత్తమునకు బూర్ణసమ్మతము గూర్పగలడు.

ర:—ఏమిసేయనిమ్ము-యశోవంతా, నామతమిప్పుడు వైరాగ్యమందు వర్తించుచున్నది. రాజ్యభారమున కీవిదివరకే సమర్థుడవై యున్నావు కావున నీపైబెట్టి నే వానప్రస్థమునకుం బోయెద-పోయి యీపఱకంతయు విషయసేవను వెదపుచ్చిన జన్మంపుసాయంతనమైనగానిమ్ము. పరమాత్మునం దస్తమింపజేయ నుంకించినాడ. నీవిందుల కాటంకపెట్టితివేని దాని నమంగళసూచకముగా భావింతును.

య:—మహాప్రభూ, దేవర నిష్కామసంకల్పముతో నాచరించిన యసంఖ్యాకపుణ్య కార్యములన్నియు భగవత్సేవాసమున్నతి యని తలపోయువాడనై తత్ప్ర భావమున దమరీవఱకే యపవర్గరాజ్యాగర్భదుర్గముపై జయపతాక నిల్పి జీవన్ముక్తులై నారని దృఢనిశ్చయముతో నాటంకము జెప్పదలంచితిని గాని తమరు వారించినపై నాప్రయత్న ముడిగితిని. సర్వజ్ఞులైన యేలినవారినిశ్చయమునకు భంగము గావింపగలవా డెంతటివాడైయుండవలయును ! మీరేమిచేసినను నాకును లోకమునకును శ్రేయమనియే నమ్మి సంతుష్టినొందువాడను.

ర:—సంతసించితి. నాశిరసునుండి పెద్దభారము దించినవాడవైనావు. మఱి పలుమాట లతో బనిలేదు. నేను సమస్తరాజ్యమును రాజ్యాంగసహితముగా వశపఱచితి. నలువదిసంవత్సరము లేకాగ్రనిష్ఠతో మహాకష్టములకు లోనై సంతరించినాను.

తద్వత్సరక్రమముగా బలపఱచినాను. నన్నుగా బ్రేమించి నాప్రజను సమస్త పురుషార్థసంపన్నుల గావింపు. రాజ్యము స్వకీయోత్కర్షాసాధన మనుభ్రాంతిచే బరిపాలనాక్రమము దప్పి నాతపస్సునకు భంగము వాటింపకు.

ప్రజకున్ దాసుడవై, సదాగతిగ రాజ్యం బెల్లెడన్ నీవ యై,
సుజనామోదము దేవకార్యముగ, వాక్శుద్ధిన్ నృపాంకంబుగా,
నిజసౌకర్యమఘంబుగా నెఱిగి నిర్ణిద్రోపధానైపుణిన్
సజయప్రక్రియ ధర్మశిక్షితమతిన్ సామ్రాజ్యమున్ గొల్వుమా.

1. ఒక్కఁడొక్కఁడు ప్రజ రాజ్యముద్ధరింప
గలుగువిద్యల గఱపు, భాగ్యముల నెఱపు
ప్రజలదర్పంబు విభవంబె ప్రభునిబలము-
మట్టుపెట్టుట తుదముట్టునుపాయముకాదు.
2. ప్రజలకోడబాటు గానినీ ప్రాభవంబు
వట్టిచౌర్యంబు సుమ్ము—నీవానిఁబరుని
కేవలాహంకృతినె యెంచి కిన్కఁబూను
టొప్పదనదలయందును యోగ్యులందు.
3. ఎదుటిపక్షము విన కేర్పరింపకెపుడు
నీనిదానంబె రాజ్యంపునిల్వరంబు
నుతుల బ్రమయకు, లోలోనిమత మెఱుంగు
పదవి యన బారవశ్యదుర్బలతె సుమ్ము.

నేనొప్పగించుపారంపర్యాధికారభారము సహస్రబాహుడవై నిర్వర్తించి, తాత తండ్రులకీర్తి నినుమడించి కాలక్రమమునసమర్థులైనసంతతికందిమ్ము. రాజులువచ్చుచుబోవుచుండు వారు-కాని రాజ్యము శాశ్వతజీవము. రాజ్యాధిపతిరాజు కాడు-ప్రజ-రాజు ప్రజాను సంకల్పుడు. ఇప్పుడే ప్రధానామాత్యులం బిలిపించి కార్యక్రమమునకుం బురికొన్ము. ప్రియదర్శనకుమారునింగూడ రావింపుము. ఎప్పటికైనను నీకు వానిస్నేహము శ్రేయోమూలముగావచ్చును. వాడు సహజప్రాజ్ఞుడు. సాటిరాకొమరుడు.

యయ:—మహాప్రభూ, విన్నవింప మఱచితిని. ప్రియదర్శనుడు నిన్నరాత్రినుండియు గానిపింపలేదట. దేవరసన్నిధిని విన్నవింప నుద్యుక్తులై యింతకుముందే వాని పరిచారకులు వచ్చుచుండగా నీవార్త విని నే గొనివచ్చినాను.

ర:—అయ్యో! వానికి మనరాజవాటియందు నిరాదరణ మే మైన జరిగియుండలేదు గదా? వానితండ్రియు నేనును ప్రాణమిత్రులము. నీవెప్పుడు చూచినావు?

య:—మొన్న సాయంతన మేలినవారిదర్బారునందు.

ర:—అప్పటికే వానిచాకచక్యమందు గొంతమాంద్యము నాకు బొడసూపినది. ఆనాటి దర్బారువేడుకలు చిత్తమునంచుతో బాటించి, చిత్తాభోగ మన్యత్ర ప్రవర్తింప జేసినట్లు కాన్పించినది.

య:—ఇంటిపై నూహాపుట్టె నేమో.

ర:—ఆట్లైన జెప్పి పోడా? ఏదేనిదోసగు వాటిల్ల లేదుగదా? సురకుమారునట్టివాడు వాడు. కారణజన్ముడు. మ రెందులకైన బోయియుండునా?

య:—వానికి మ రెచ్చటను బ్రయోజనములు లేవు మ రెవ్వరితో ననుబంధములు లేవు. మహామితభాషి. మంచిపొదుపరి. చక్రనియోస్పదము గలవాడు-ఇంతచనవుగల దర్బారునగరులందుగూడ స్త్రీలయందు బరమభక్తితాత్పర్యములును, మనయం దఖండవినయమును గలవాడు.

య:—వానివంశ మెటువంటిది! ధర్మబాహుమహారాజపరజనకుడు. రాజర్షి.

(దౌవారికుడు ప్రవేశించును)

దౌ:—మహాప్రభూ, అంతఃపురమునుండి యొక చేటి తొందరగా బాదదర్శనము వేడుచున్నది.

ర:—రమ్మను.

(చేటి ప్రవేశించును) - (చేటిం జూచి) ఏమి వింతలు?

చే:—దేవా...(తెల్లబోయి చూచి వడవడ వడకును)

ర:—చెప్పు-అంతఃపురమం దందఱకును క్షేమమే కద?

చే:—నే దక్షిణాదేవియంతఃపురపరిచారికను-(వడకును)

య:—భయపడకు- నీవచ్చినకార్యమేమి?

ర:—దక్షిణకుం గుశలమా?

చే:—మహాప్రభూ, మన్నించాలి-రక్షించాలి - (రెండుచేతులతో గన్నులు మూసుకొని యేడ్చును.)

ర:—ఏమి జరిగినది?

చే:—దక్షిణాదేవి లేదు—మహాప్రభూ!!! (ఏడ్చును).

య:—ఏమీ, ఎప్పటినుండి? ఎచ్చటి కేగెను (ఆశ్చర్యముతో).

చే:—నిన్నరాత్రి పరుండేసరికి చూశాం అంతానూ. నేను తాంబోలం యిచ్చి పాదాలమీదనే చేతులేసుకుని నిద్దరోయాను. నాపక్కను పెద్దతివాసీమీద మాలిని పడుక్కుంది. మెట్లమీద మొగనౌకర్లు పడుక్కున్నారు. ద్వారపాలకులు యిటూఅటూ తిరుగుతూనే వున్నారు. పట్టపగల్లాగ వెన్నెల కాస్తూంది. తెల్లారుగట్ల నాంతట నేనే లేచాను. దేవిగారు నాకన్న ముందు లేచేరని ఆశ్చర్యపడ్డాను. ఇప్పుడు కనబడతారో యిహ కనబడతారో అని చాలాసేపు నిరీక్షించాను. కొంతసేపుండి నౌకర్లందర్నీ లేపి అడిగాను. నేనెరగనంటే నేనెరగనన్నారు అందరూనూ. దౌవారికులు యెరగం అన్నారు. మాలిని అంది: అప్పుడప్పుడు లోపమేడ్లోకి వెళ్లిరావడం కద్దు, అక్కడికి వెళ్లేరేమో అంది. గుఱ్ఱపుసాలదగ్గిర కెళ్లిచూస్తే పెద్దసవారీగుఱ్ఱం, జీనూ లేవు. బతుకు జీవుడా అని కొంత ధైర్యం తెచ్చుకొని ఉదయం అయేటప్పటికి నేనూ మాలినీ నడిచి దంతధావనం సామానుపట్టుకు లోపకెళ్లేం- అక్కడ చిన్నమహారాజుగారి నౌకర్లు జాముపొద్దెక్కేదాకా వుంచేసి అప్పుడక్కడికి రాలేదన్నారు. మమ్మల్ని చూసి నవ్వి వేళాకోళాలు చేసేరు. అక్కడ నిరాశచేసుకుని తిన్నగా పెద్దజనానాకి వచ్చాం. అక్కడికీ రాలేదన్నారు. పట్టమాదేవిగారు అన్నిమహల్లూ వెతికించారు. ఎక్కడికీ రాలేదన్నమాటే-గుండెలు బాదుకొని యేడ్చారు. నన్ను ముందుగా వెళ్లి యేలినవారికి మనవిచెయ్యమని పంపియారు. ఒక అరగంటలో దర్శనానికి వేంచేస్తాం, యువరాజమహాప్రభువువారినికూడా పిలిపించి ఉంచమన్నారు.

ర:—ఏదిగుడుబావిలోనైనను బడలేదు గదా? నేనేమిచేయుదును?

య:—లేదు, లేదు. నేననుమానపడినట్టే అయినది. ఆహారిణముఖజంబుకము, ఆనరవేషనరాంతకుడు, ఆమర్జునుడు మనకన్నులలో నిసుకజల్లి వంచించి కొంపోయినాడు.

ర:—వత్సా, యింకను దొందరపడకు- ప్రియదర్శను దంతద్రోహియని నే దలంపను. కాని నీయనుమానమే నిజమయ్యేనేని వాని నిందింపబనిలేదు. తప్పు కేవలం నీతప్పునిది. అంతటిదారుణవిసర్జనమును మహామహాపతివ్రతలు భరింపలేరు. ఆయిల్లాలెంత కాలమెంతగా నోర్చినది నేనెఱుగుదును. అట్టిజగదేకసుందరిని బుద్ధిపూర్వకముగా దృణీకరించి, సామాన్యను వరించి దానికి దాసానుదాసు డైయుండుట వానిదౌర్భాగ్యము. తుదకామెను గోల్పోయి, యీపరాభవము లోకవిఖ్యాతముగావించుట దానిమించినదౌర్భాగ్యము. ఇంకను ఆమెయాత్మహత్యజేసికొన్నదనియే నానమ్మకము. అయ్యో! పాపము!! అయ్యో !!!

య:—(చేటితో) మీరాణి యింతకుమున్ను నిశావిహారములు నేయుట కలదా ?

చే:—వెన్నెలరాత్రుల్లో లోపమేడకెళ్ళి యరుణోదయాని కింటికి రావడం కద్దు.

య:—ఒంటరిగా ?

చే:—ఆ-పెద్దగుట్టాన్నెక్క.

య:—ఎంత కాలమైె ?

చే:—పదిపదకొంఘునెల్లనుంచి.

య:—కుశలుడిల్లువిడచి స్వచ్ఛందవృత్తి నవలంబించి రెండేండ్లయినదేమో ?

చే:—ఆమధ్యను భర్తగారితో మళ్లీ స్నేహమైెందట కాదూ ?

య:—అలాగు మీకుజెప్పినదా? అయితే లోపమేడకు వెళ్లినప్పుడు నిన్నెప్పుడైెనను వెంట గొనిపోయినదా ?

చే:—లేదు. శతానందుడు కూడా వెళ్లవాడు.

య:—ప్రియదర్శను డెన్నడేని మీనగరునకు వచ్చుట కలదా ?

చే:—నే నెఱుగను. కాని అప్పుడప్పుడు శతానందుడూ, నేనూ కలిసి మారాణీగారితో కాశ్మీరరాజుకొమిరు బసలోకి ఉద్యానాని కెళ్లేవాళ్లం. మళ్లీఅప్పుడే వచ్చేసేవాళ్లం.

య:—కాశ్మీరరాజుకొడుకునకును మీరాణీకిని నేపాటిస్నేహం ?

చే:—లేదు ఊరికే పలకరించుకోడమే - యెప్పుడేనా వెడితే చల్లబాటువేళ వెళ్లి అప్పుడే మళ్లీరావడం.

య.—ఎవరక్కడ? శతానందుని పిలిపించు.

(లోపలినుండి దౌవారికుడు) చిత్తం మహాప్రభూ.

చే:—అసలు మారాణీగారికి ఆర్నెల్లనించి పరధ్యానం హెచ్చైెంది. మాటోమాట యధోచితం. అప్పుడప్పుడు భోంచేస్తూ అలాగే ఆలోచిస్తూ కూర్చుని మళ్లీ జ్ఞాపకం వచ్చి సగుం భోంచేస్తూ లేచిపోవడం-ఒకొక్కప్పుడు నిద్దట్లో లేచికూర్చుని నన్నో మాలినో్న లేపి అహల్యకథా తారకథా, చెప్పమని వోమాటూ, యేదేనా పాటపాడుమని వోమాటూ అడగడం-స్త్రీసాహసపుకథలూ కృష్ణలీలలూ మాయిష్టం-కానిపాడుతూండగానే ఆచిత్తం యెక్కడికో పోయి వింటూ వినక, జవాబుచెప్పిన ప్రశ్నే మళ్లీ అడుగుతూ, నవ్వించేమాటలుచెప్తే యేడుస్తూ, భక్తివైరాగ్యపద్యాలు చదివితే నవ్వుతూ యేభోగంమీదా దృష్టిలేక, భోజనం కూడా ఆపోక మతిపోయినట్టుండడం-ఏలినవారిహుజూరుకూ, మహారాణీగారిహుజారుకూ వెళ్లనప్పుడూ, దర్బార్లలో కూర్చున్నప్పుడూ యెక్కణ్నిం

చో చిత్తం పొవాటి యెరువు తెచ్చుకుని మాట్లాడడం-యీసంగతులు పెద్దజనా సావారితో మనవిచెయ్యగా కొమారుణ్ణి నిందించి దైవయోగానికి విచారించేవారు. ఓవారంరోజుల్నించి కాబోలు, ఆదీర్ఘాలోచన్ను మారి, కొంత మళ్లీ మనుష్యుల్లోకివొచ్చినట్టు మనవ్యూహాలూ, మనమాటలూ చేష్టలున్నూ-పొగలల్లా జవాహిరీ,బట్టలూ సవరించుకుని, యిక్కడిదక్కడా, అక్కడి దిక్కడా పెట్టుకుని అన్నీ వుండజూసుకోవడం ఆరంభించారు. పోనీ బాగానేవుంది, యీవేళంభంఅయినామంచిదే అనుకొని సంతోషించేవాళ్లం.

(దౌవారికుడు ప్రవేశించును)

దౌ:—మహాప్రభూ, శతానందుడు గ్రామాంతరం వెళ్లేడట. యెప్పుడువచ్చేదీ యింటివద్ద తెలియదట.

(రణసింహుడు దీనుడై కూర్చుండును)

య:—(దౌవారికునితో) సరే నీవు పోయి దండనాథుని బిలిపింపు.

(చేటితో) చేటీ నీవమ్మగారిసన్నిధికిం బోయి, మేమే యొకనిమిషమాత్రములో వచ్చుచున్నామని విన్నవింపు.

(రణసింహునితో) మహాప్రభూ, ఇక తడయబనిలేదు.

(దండనాథుడు ప్రవేశించును)

దం:—మహారాజేశ్వరా, వీరాధివీరా, జోహారు.

య:—ప్రభువులపేర నీయాజ్ఞం గొనుము ఇందు కుత్తరక్షణమందు నీవు శగవేగముగల గుఱ్ఱములపై నాయుంధపాణులైన రణశూరుల నలుదెసలకంపి దక్షిణాప్రియదర్శనులలో నెవ్వరైనం గాని యిర్వురు గాని కన్పడిరేని కాళ్లేతులు విరచికట్టి యిటకు దెమ్మని పంపు. బహుశః కాశ్మీరదేశమునకుం బోవుమార్గమందు దొరకగలరు. రాజమార్గములందుకన్న నడబాటలందే కానగుదురు. ఇర్వురును నకులునివంటి గుఱ్ఱపురౌతులు మహాసాహసికులు. ఇర్వురును ధనుర్విద్యాపండితులు.కనబడి తప్పించికొనజాలరేని నుత్తమపక్షమైన వశీకరణమువీలుకానపుడు శరాగ్నివృష్టిచే రూపుమాపిగ్గొన రమ్మని యాజ్ఞాపింపు. మార్గమధ్యమందు గాన్పింపరేని దిన్నగా గాశ్మీరరాజధాని కేగి మారాయబారులై రాజునొద్ద ప్రభువులమాటలుగా నిట్లు చెప్పుమను-

"మీకుమారుడగు ప్రియదర్శనుడు మారాజధాని కొకయేడాదిక్రిందట దేశయాత్రామిషమున వచ్చి మాచేనతిథిసత్కారములం బొంది, చనవుమీఱి, క్రమ

ముగా మాకుటుంబమునందుంకటను రక్తబంధువులనుమించు చేరకగలవాడై, మాకొందవ కోడలగు దక్షిణాదేవిని ద్రోహియై కొంపోయినాడు. చిరకాలమునుండి పారంపర్యముగా మనకుంగల సెయ్యముం బాటించి యాతనిం గౌరవించినాము. స్వప్నమందైనను ఇట్టి యాసురకృత్యము జేయగలవాడు మాయింట బుట్టియుండునని యనుమానింపలేదు. ఇప్పుడు మీరు పూర్వోత్తరములం గమకించి దక్షిణను దిగిడ మాపీట కంపరేని, ఐతురంగబల సమేతముగా మీపై దండయాత్ర జేసి మీదుర్నయమునకుం దగినట్టు మీరాజ్యము భస్మపటలము గావింతుమని నమ్మవలయును.

ఈసందేశము తోడ్తోన యంపి నేనుమొదలు నీవశ్వగజోష్ట్రపదాతిసైన్యముల యుద్ధసన్నద్ధుల గావింపుము పొమ్ము.

(దండనాథుడు సాష్టాంగపడి లేచి నిష్క్రమించును.)

మహాప్రభూ, మీవలచినతపస్సున కున్యమింపుడు ఈకార్యభారమంతటిని నాపై బెట్టి స్వస్థచిత్తులరై యధ్యాత్మనిష్ఠకుం బూనొక్కుడు. మీయాప్తతము సెరవేర్పలేమి మీకు బుత్రుడులేనట్టే లెక్క. ఏలికలు రాజ్యభారము నాయందనుగ్రహించి యుంచిన తొలుదొల్తనే పూర్వార్జితమగు కుటుంబగౌరవము గాపాడు ప్రయత్నమునందు రణరంగమందుబడి వీరస్వర్గమొందగలుగుట నాకు మహాభాగ్యము కాని ప్రాణము విడువకమున్నే శత్రువులనుదగ్ని వ్రేళ్ళతో బెల్లగించి దుశ్చరిత్రమునకపజయావమానపూర్వకమగు వినాశము సహజానివార్యఫలమని లోకహితముపేర లోకమంతటికిని బ్రకటింతును గాక-భగవంతుడా, న్యాయచోదితమైన నాసమరము సజయము గావించి న్యాయోద్ధారము జేయుము.

(తెర)

(అత్యంతసంతుష్టితో గూడిన దుష్యాండిత్యము వెల్లడించు ముఖవైఖరితో సమరప్రియనీడ రంగము నొకప్రక్కనుండి మఱియొకప్రక్కకు నడచుచున్న ట్లిప్పుడు ప్రదర్శింపవలయును.)

---

## తృతీయాంకము - తృతీయరంగము.

---

(యోధపురముదరి యెడాగి-సమీపమందు బలపపుతాతిగనులనుండి వివిధరూపములుగా దీసి పైనతిదూరముపఱకును వేయబడిన ఱాలగుట్టలు-ఎడనెడ నుప్పుపట్లులు-ఉప్పుకుప్పలు - సన్యాసివేషముతో సుప్రతప్రవేశించును.) కాలము పగటితో విజాము.

సు:—రాజపుత్రరాజ్యసమర్థమైనయాదేశమందును బ్రియుడు కానరాడు. కాని భరత

వర్షమందలి సంస్థానము లన్నిటిని గాంచివైచెద. ఆసేతుహిమవత్పర్యంతము నిదేరీతిగా భూప్రదక్షిణము గాంచి యేనాటికైన నాథవ్యశీలుం గనిపెట్టకుం దునా? ఇష్టదేవతాకటాక్షమున నింత సజీవుడై యున్న జాలును. అబ్బా! యీ మహామరుప్రదేశము గడచిన కొలది పెరుగుచున్నట్టున్నది! కాని నాకు దూరాదూరములతో బనియేమున్నది? పురమరుస్థలభేదములతో బనియేమున్నది? ప్రియసమాగమమే ముఖ్యాశయముగా గలనాకీదేశయాత్రలకేగాదు, యావజ్జీవయాత్రకును నాథవ్యశీలుడే గమ్యస్థానము.

(ఒకబాటసారి ప్రవేశించును)

నాయనా, మీరెక్కడికి బోయెదరు?

బా:—యౌధపురమునకు-మీరో?

సు:—సన్యాసికి విశ్రమస్థానమే గాని గమ్యస్థానమేమి? ఇక్కడికా యౌధపురమెంత దూరము?

బా:—ఎంతో దూరములేదు. ఆకనబడు వేపచెట్లే. మీరచ్చటికేగుదురా? ఎచ్చట నుండి వచ్చుచున్నారు? ఏయేదేశముల జూచినారు?

సు:—భరతఖండమందుగల క్షత్రియసంస్థానముల నన్నిటిని సేవించుచు వచ్చినాను. ఇప్పటివఱకు ఆసేతువింధ్యమువఱకును సమస్తదేశములం గాంచి యాయారాజులవరిపాలనాక్రమము నారసినాను.

బా:—నేడిందు విశ్రమించి మాగృహము బావనము సేయ వేడెద.

సు:—మీయూరివిశేషము లేమి? మీరాజు ప్రజానురక్తియేనా? ఆయనకు సంతానమెందరు?

బా:—సంతానము లేదు-వయోవృద్ధుడు-సత్పురుషుడు.

సు:—అయ్యో పాపము! అయితే అనంతర్యముమాట యేమి?

బా:—దౌహిత్రులగు కాశ్మీరరాజపుత్రులలో నొకరిని దత్తస్వీకారము జేసికొన్నారు.

సు:—ఆకాశ్మీరరాజున కెందరుపుత్రులు?

బా:—నలుగురు- అందులో గడపటివాడు జీవన్మృతుడై పోయినాడు.

సు:—అది యేమి?

బా:—వాడు లెక్కకు పుట్టినాడు. వాడు జన్మింపకముందు తల్లికగబడిన కొన్నిదుర్నిమిత్తములంబట్టి యథఃపతనమైన వెన్వెంటనే వింధ్యాటవిని విడచిపెట్టినారు. కాశ్మీరమునువాటీదేశముల ప్రజ లిప్పటివఱకును ఆకనికరపు వృత్తాంతము దలచుకొని కంట నీరువెట్టక మానరు. ఆతలిదండ్రులమాట చెప్పెడిదేమున్నది?

సు:—ఇప్పుడాచిన్నవాడు జీవించియున్నాడా?

బా:—ఇప్పటి కిరువదిమూడేండ్లయి యిది జరిగినది. ఆశిశువు కోటిమన్మథమనోహరమూర్తి. అప్పుడే మృగములకాహారమైయుండును. ఆటుతరువాత వానింగూర్చి వినము. దత్తుని మూడవవాడు.

సు:—ఆకాశ్మీరమునకు మార్గమెద్ది?

బా:—ఇక్కడికి జాలదూరము హిమపత్పర్వతప్రాంతము మీరువచ్చినమార్గముతోగదిపోయి, అటనుండి నైర్ఋతిమూలగా బోవలెను.

సు:—రాజధాని?

బా:—శ్రీనగరము-వితస్తానదీతీరము.

సు:—నే నందుల కేగెదను.

బా:—నేడియ్యెడ నేదదేరి.

సు:—లేదు-తొందరగా బోవలసియున్నది. కాశ్మీరమందు నాసహపాఠియొకడుగలడు. అతని రెండుమూడుదినములలో గలసికొని మేమిరువురము గర్భయాత్ర జేయనైయున్నాము. మాయిరువురపైని బ్రద్ధభారమొకటి కలదు. దానిని భగవత్ప్రీతిగా నెరవేర్చుట నాజన్మపరమావధి.

బా:—ఉదయపురము జూడరా? ఇదే మార్గము.

సు:—కాశ్మీరముతరువాత నన్నియును. ఇప్పటిలో మీరాజ్యమే చూడను.

బా:—ఒకపూట మాపీటనుండి శ్రమతీర్చికొనుడు. మీయట్టి యవధూతలూరిపొలిమేరకు వచ్చి యభోజనముగా మరలిపోవుట మాకు శ్రేయస్కరము కాదు. మధ్యాహ్నము కావచ్చినది—

సు:—లేదు. నాకు వృథాలస్యము జేయక ఇప్పటి కుత్తరువిప్పింపుడు. నయుద్ధమున్న కందమూలఫలములతో నీపూట గాలముపుచ్చి, రాత్రి ప్రక్కటియూరికిం బోయి నిద్రించెద. భగవత్కృపవలన నాకాసారవాతాతపములు దుర్భరములు కావు. క్షుత్పిపాసలు బాధింపవు. జనుశ్ఫలసంపాదకమగు నాతపోదీక్ష సకలద్వంద్వాతీతుం జేయగలట్టిది. కేవలమనోదార్ఢ్యముచే మానుషమమానుషము గావించి సమస్తశృంఖలచ్ఛేదకశక్తిం గసిపెట్టినాను. నాకు ముల్లోకములును స్వాధీనములే. నాకు భయము భయపడును. ఓటమి యోడిపోవును.

బా:—(అడుగులపై వ్రాలుచు) పరమతపోధనా, నాయాతిథ్యము గైకొని నగారన్ను వింపకపోయినను నాయందు నిర్హేతుకజాయమానకటాక్షముచే నను గ్రహించి

మిమ్ముల నింతతపస్సిద్ధులంగావించిన యీపరమయోగరహస్యముపదేశించి సుంత తరణోపాయము జూపి పోదురు గాక - తీవ్రజిజ్ఞాసతో నడిగిన వగమియ్య ననరాదు. భక్తునం దనుగ్రహింపుడు.

భవము ప్రాకృతఫలమీన బ్రకృతిగొల్వు;
పారమార్థికమొంద నీశ్వరు భజింపు—
రెండుకృషులును వేఱ్వేఱు—రెంటగూడ
పౌరుషము వేయుపాళ్లు, దైవంబుపాలు.

ఈమంత్రము బురశ్చర్య గావించి, యందలి పరమార్థము నవితర్కమతితో బరిగ్రహించి, యనన్యచింతతో నాచరించితివేని నిహపరముల కమోఘతరణోపాయము కాగలదు. ఇక నేబోయెదను. సుఖముండుము.

బా:—గురువర్యా, ఇదే నానమస్కారసహస్రము. (సాష్టాంగపడును) కాని నావూజ లందు బఠించుకొంటకు తమపుణ్యనామముం జెప్పి నన్ను గృతార్థు గావింపుడు.

సు:—నాపేరనుభవానందయోగి.

(ఇద్దరు రెండువైపుల నిష్క్రమింతురు.)

---

శ్రీరస్తు.

# స్వర్ణచూతము

## చతుర్థాంకము - ప్రథమరంగము.

---

(కాశ్మీరరాజధానియగు శ్రీనగరమందలి ఏర్పాటుసాపడె. ధర్మబాహుమహారాజును దత్పట్టమహిషియగు ప్రమోదాదేవి యాతని వామపార్శ్వమందును, దక్షిణపార్శ్వమందు ప్రథమపుత్రుడగు శత్రుశక్తియును, ద్వితీయపుత్రుడగు నాదిత్యుడును, ప్రియదర్శనుడును, ప్రియదర్శనుని దక్షిణపార్శ్వమందు దక్షిణయు ప్రవేశింతురు. ధర్మబాహుడు కనుదీనుడై కూర్చుండును. ప్రమోద వైఖరియందు బట్టుపలయు నెగ్గుగొన్న కోపమును గన్పడును. అందఱును దదేకధ్యానముగాను, విచారగ్రస్తులుగాను ఆలోచించుచు గూర్చుండి కూర్చుండి, తుదకు)

ప్ర:—పతినని నన్ను గాపురము బాపుదుగాక; నృపుండవై కుపుత్రా
వ్రతమతిఁ దప్పు సెప్పక ప్రవాసము సేతు—వధింతు గాక!—యే
గతిఁ బ్రకృతిప్రకాశము వికల్పము సేయ నెంచ సేతు తల్లి సం
తతి? భవదీయశాసనమునన్ బ్రజకబ్బవొ నైజభాగ్యముల్!

2. కడవరికొన్ని నాకడుపుగాదిలిపంట సహస్రవృద్ధిఁ జే
పడినవినష్టవిత్త—మెడబాతునొ? ఝల్లని చేవృపాలపాం
గడఁగెనొ లేదొ,—కొంక కెటులంటివి? చిన్ననాఁటిలోకి మొ
క్కడయి శరించినన్ మనుదు గొండ్లకలోకము జేరి పుత్రుతోన్.

ఎన్నితప్పులు చేసిననేమి? తప్పుజేసినకొలదిని, బరులు వికటించినకొలదిని, నా కొడుకు నాకనుకంపాపాత్రుడే, ప్రేమాస్పదుడే - తప్పులు గలిగిన సమర్థించి సవరించి కొందును గాని నాగర్భశుక్తిముక్తాఫలమును బారవైచికొందునా? మందబుద్ధితో నిది వఱ కెడబాసిన మహాదోషమును దదసివార్యవిషాదఫలమును అపూర్వానుగ్రహముతో బరిహరించి క్రమ్మఱ నాయానందకందమును నాయక్కునం జేర్చినాడు దైవము. పదంపడి యదేపొరపాటు చేతులార జేయ దొరకొందునా? మృత్యువుచే దప్ప వేఱొంట నాప్రాణధనమగు పుత్రు నెడబాయను. (ప్రియదర్శనుని మెడకు జేతులు చుట్టి, వానిశిరస్సుపై దనశిరస్సు మోపి కన్నీరు విడచును.)

ఆ:—తండ్రీ, యైహికార్థములన్నియుం భుజబుద్ధిబలాశ్రయములు-కేవలవీరభోజ్యములు. నవనవప్రవర్ధమానపౌరుషశాలికి ధర్మాధర్మపరిమితవిచారము వట్టికమలాకర నావికాయాత్ర. ధర్మాధర్మసంప్రదాయములు ధైర్యసాహసవిహీనుడగు లోకానుయాయికి గాని, యఘటనఘటనాసమర్థుడగు లోకాతిశాయికి గావు. సనాతన ధర్మానువర్తనము లోకశ్రేయోపభోగమునకే గాని లోకోద్ధారమునకుం గొఱ గాదు. స్వీయసౌకర్యమునకై తల్లి శ్రీకృష్ణుని ఱోటికి గట్టివైచినట్లు బల సంపన్నులను బలహీనులపై బడకుండ బన్నినశృంఖలములే యీధర్మతంత్రము లన్నియును. కాని లోకస్థితికై మనము కల్పించుకొన్న యీధర్మములన్నియుం దత్తద్దేశకాలోచితముగా స్వరూపస్వభావముల మార్చుకొనుచుండవలయును. ఈపరమార్థము నెఱింగి వలయునప్పుడు పూర్వాచారపరిపోషణముకన్న తదుల్లంఘనము చేతనే లోకసంగ్రహము గావించుచు నిట్టె యమళార్జునభంజనము, అట్టె గోవర్ధనోద్ధారము, ఇట్టె తరుణార్కకబళనము, అట్టె సముద్ర చుళకనమునకు సాహసించు నుద్దామతేజశ్శాలినే యశోలక్ష్మి వరించి త్రిలోకపూజ్యుం గావించును. ఆచారశృంఖలములకే లోబడియుండిరేని మహావీరులగు మనవంశకర్తలీరాజ్యము నార్జించి, యనుక్షణవిజృంభమాణమొనరించి మనకప్పగింప గలుగుదురా? తమ్ముడు స్వతస్సిద్ధముగా మహారథుడు. అందుకు దోడు వీరాధివీరులగు దేవరసంరక్షణము. ఇట్టిసమయముగలప్పుడే వలచినశ్రేయముల సేకరించి జన్మము ఫలవంతము గావించికొననిండు.

ధ:—ఆహా! యెంతనయశాస్త్రకోవిదుడవు? ఆవిత్యా చాల్చాలు! నీవుపన్యసించినదాసురధర్మము నీవు నాస్తికశిరోమణివి. నిష్కామత్యాగమాహాత్మ్యముచే భూతసృష్టికంతటికి నాభరణాయమానమగు నాగరకజనసంఘమును బరస్పరహింసైకజీవులైనక్షుద్రసత్వకిరాతసంప్రదాయములపాల్సేయ దలంచుచున్నావు. మనపూర్వుల కీరాజ్యమొక్కనాటికి ధర్మేతరమార్గములచే నలవడినదికాదు. అలవడెనేని నింతకాలము నిలిచియుండదు. అధర్మప్రవర్తన మేనాటికైనను జచ్చుమాటగట్టుటయే - దాని సేవించుటగ్నిపర్వతసానువులయందు నివాసము నిర్మించికొనుటయే!

ఆ:—అన్నయ్యా, ఇందధర్మ మావంతయు లేదు. సంపూర్ణమనస్కారముతో వధూవరులు ప్రకృతిమాతృకాసేవకై యంతరంగముల నొక్కటిగా హత్తించి సుఖంచుచుండ దద్వ్రతభంగము గావించుటకన్న దారుణమైన యధర్మమేమి? మహాప్రభూ, చేతగానిదుడుకుబోతుమాటలాడిన యీపాంచాలరాజునకు జెల్లినది కాని

మనమిట్లాడదగునా? (చేంతనున్న పాంచాలరాజుయుద్ధపత్రిక నొడిసితీసి చదువుచు) "ద్రోహియై కొంపోయివాడట!" మనపై దండయాత్ర లట! "రాజ్యము భస్మపటలమట!"—బుద్ధిహీనుడు! వలపాద్రోహము, దానిజంపదలచిన బెదరింపులా? ఏమిప్రజ్ఞలు చెప్పుకొన్నాడు. దిగంతవిశ్రాంతప్రతాపవైశ్వానరుడగు ధర్మబాహుమహారాజులపరాక్రమజ్వాలం బడి తానును దనసేనయును శలభములట్లు భస్మీభూతులగుదురు, రానిమ్ము దండయాత్రకు!!

శ్రు:—నినీ, ధర్మాధర్మములమా టటుంచు, నీతమ్ముడు జన్మింపక ముందు దహనజ్వాలం బురస్సరించు ధూమమట్లగపడిన దుర్నిమిత్తముల మాటేమి? తమ్ముడు జంటితేనె గానిమ్ము- వాని యాసురచేష్టలు పరమాత్మాయసిద్ధములు గానిమ్ము. అట్లని వానిచే వాటిల్లు విపత్తులకు నిర్దోషమగు రాజ్యము నెట్లు బలియివ్వగలము?

ప్ర:—మూర్ఖుడా, స్వప్నమును నమ్మి, వాస్తవమైన మహాపదవి చేతులార విడనాడి కొందువురా? కలయే కల్ల. అది తెచ్చు భావ్యదంతము నిమ్నోన్నతాదర్శప్రతిబింబమట్లు స్వభావాభాసమై మోసపుచ్చు. స్వతస్సిద్ధముగా నవిద్యకు బుట్టినిల్లై సుఖదుఃఖస్వరూపముల దారుమారుగా నగపరచు సంసారప్రకృతిని స్వప్నమను ప్రహసనమందు వేషాలగట్టి దేవత వెక్కిరించుచుండును. ఎడతెగక కోరుచుండుకోర్కుల కరతలస్వర్గముగా నెరవేర్చినట్లు నటించి మనవ్యామోహమును మనచిత్తజాడ్యమును జూచి నవ్వుకొనును. దానిం జూచి సంసారమొక దీర్ఘస్వప్నమని మెలకువ తెచ్చుకొని మోహము విడువవలసినదే గాని, నిజమని నమ్మి లోకానుభూతికి వ్యతిరేకింపనగునా?

ఆ:—కాదు, కూడదు, నమ్ముదునందువా, తమ్ముని ప్రవాసమునాటనుండియు మనజననీజనకులును, మనమును, ప్రజయును బడిన సంక్షోభమువలన స్వప్నసూచితఫలము వాటిల్లనే వాటిల్లినది. ఆస్వప్నపీడ యిరువదిమూడుసంవత్సరములరాజ్యక్షోభముతో నివారణమైనది మఱి మూడవలసినకీడు లేదు. రానున్నదంతయు విజయమే.

శ్రు:—కన్నులు తెఱచి కపటనిద్రబోవువాని నెవరు లేపగలరు? నీకిందు కీడే పొడకట్టలేదా? ఇప్పు డాసన్నమైనయుద్ధము యుద్ధము కాదా? యుద్ధము కీడు కాదా? నేడు పాంచాలుర కేమియుత్తర మంపుమందువు?

ఆ:—అన్నయ్యా, దూరదృష్టితో నాలోచింపవేమి? నీకిప్పటిఖేదమోదములే కాని పొడసూపవేమీ? యుద్ధము కీడే- కాని జయమో? కీర్తియో? ప్రాంతరాజ్యాక్రమణమో?

శ్రు:—అటుగాకిట్లైతే?

ప్ర:—ఓగి శకునపక్షీ! ఓరి పిఱికిపిచ్చికా! నీవటరా యీరాజ్యమేలగలవు? నిన్ను గడుపున గంటినని యనుకొనుటకే నాకు సిగ్గగుచున్నది. గాజులు తొడిగించుకొని పాపట దిద్దుకొని పసపు, పారాణి రాసుకొని యంతఃపురమందు కూర్చో. నీకేమియును భయము వలదు. నేబోయి యుద్ధముజేసి శత్రువు గెల్చివచ్చెద.

ఆ:—అన్నయ్యా, బ్రతుకొకపెద్దఘంటము. ఓటుదుమన్నభీతి విజయశీలునికి లక్షణము కాదు. తఱచితఱచి పురుషార్థములందుండి యమృతము దీయవలయును గాని హాలాహలముద్భవించి తన్ను, లోకమును గాల్చునేమో యని వెఱచితిమేని మహాఫలము లెట్లు చేకూరును? ఉద్భవించిననాడు త్రిలోకశంకరుడగు శంకరుడుండ నేయున్నాడు. ఓడ్పైయున్నప్పుడు ఓడినవారిలో మనమొక్కరము. యిప్పట్టున నింతకన్న మార్గములేదు. చక్కగా నాలోచింపుము. తమ్ము నిప్పుడు విడనాడితిమేని శత్రువులబారి కగ్గముగావించినవార మగుదుము. అశక్తులము, దుర్జనులముం గూడ-

శ్రు:—లేదు - పరులసోత్త్రోరుల కప్పగించి రానీ - దాన నెవ్వరికి నుపద్రవము కలుగదు.

ప్ర:—ఛీ! ఆడాదిమాటలు మాని క్షత్రియవీరునటు యుద్ధమునకు దిగు. నేశాసించుచున్నాను-నిన్ను ఒల్లవేని యీవరాజ్యము విడిపించెద. ఎదుర్కొంటివేని నుత్తరక్షణము నీదికాదు. (కన్నులెఱ్ఱజేసి మొలనుండి కత్తినూడ్చి ఝళిపించును.)

ధ:—(లేచి సతీసుతుల నహము వద్దముగా నిల్చి)

సతిసుతులార, మీసాహసంబములకు
దగు దిట్టనిగాను—నను వారముగ్గి
పడియుడంగెడి వేడ్కపడ వేళ వచ్చె—
వినిగితి నానాడు విజయమ్ము లంది,
శత్రులలో గొంటి శతసహస్రముగ,
అరులతో రాజ్యసీమాంత రేఖలను
గడినమై గతిమితి గకుబంతములకు-
సకలజిహ్వాగ్ర భూషణమ్ముప్ప కీర్తి,
తరువాయి లేదొంక గరుశ్రేయమొకటి,
తమి లేదు రాజ్యాభ్యుదయమందు గూడ

ఎన్నాళ్లో తుచ్ఛప్రకృతిసేవ యికను ?—
చిరతరభూతసృష్టియె దాని బిరుదు-
తనపని గావించుచనుక లాలించి,
ధనబలకీర్తుల దర్పంబు నించి,
పందెపుగోడె నా బలిపించి పెంచు;
పిదప నాధివ్యాధిపీడచే చీల్చి,
యొండించి, జరకును మృతి కొప్పగించు-
మీాయందు, రాజ్యలక్ష్మీ క్షేమమందు
నలవడె బ్రాకృతయజ్ఞావభృథము-
గెల ముగ్గి యడగు చక్కెరకేలి యట్లు
ఫలియించి యడగెను ప్రాకృతాంగంబు
తనువున మిగిలెను ధార్మికాంశంబె
ఒక్కముహూర్తార్ధ మున్నదో యేమొ
పరమార్థభాగ్యోపకరణంబు సేయ
కింకను రాగంబు లేల ద్వేషంబు
లింకను స్వోత్కర్ష లేల పంతములు ?
మీాయిచ్ఛ మెయి గిడు మే లెంచికొనుడు
రాజ్యము మీాది, ధర్మము మీాది, లాభ
నష్టములును మీావి—నావంతు పూట
పోలల బత్తెమ్ము చాలు శ్రేయమ్ము—

ప్రి:—ఇంతయల్లకు నేగదా కారణము! నేనవాచ్యుడను. అమంగళమూలమును. నే నియ్యెడ నుండదగను. నన్నుండి మీాకెవ్వరికిని ధర్మసంశయము లక్కఱలేదు. నేబోయెద- ప్రపంచ మనంతము. నావంటిసహస్రకోటిజీవరాసుల భరింపగలిగిన యాతల్లికి నేనొక్కడనా భారమయ్యెదను! ఆనాడు కన్నులు తెరవని కూననైనప్పు డొకస్వప్నమునకు వెఱచి భూతదయ విడనాడి యడవులపాలు చేసినారు- ఇప్పుడు స్వప్నముకన్నను మిథ్యయగు నొక్కశాస్త్రవాధముని నమ రోజ్జృంభమునకు వడవడ వడంకి కడుపునబుట్టిన కొడుకును మరల విడనాడ నుంకించుచున్నారు. ఇట్టి వాత్సల్యమునకును, ఇట్టి మహాపరాక్రమశీలమునకై శాశ్వతకీర్తి ననుభవింపుచు సుఖముండుడు. నా ప్రవాసమే నాకు సుఖావాస

ము. మీరు భరించి నాకును సాభార్యకును దొప్పెడు గంజి పోయురని యంర కలు జేయుచు దేశదేశములదాటి మీపంచ జేరబోయినాను. (దక్షిణతో) రెమ్ము, పోదము (ఇరువురును లేతురు.)

ప్ర:—(లేచి యిరువురను రెండుచేతులం బట్టుకొని) వలదు, వలదు. మీయిరువుర కొఱకై సర్వస్వపరిత్యాగము జేయదలంచినదాన. నేనిటగల్గునంతవఱకు మీ రనహాయులు కావద్దు.

అ:—మీరు పోవద్దు. మిమ్ముల భరింపనొల్లనివారే పోదురుగాక. సౌభాగ్యలక్ష్మియగు దక్షిణ గల్గుచో నపయశోపమానములు వాటిల్లవు. అజగన్మోహనాకృతిం దన్వి లీర గ్రోలుటకై మంగళదేవతలు భూతలమునకు బాదచారులై వచ్చి యా మెను నంతతము సేవింతురు. ఇక శత్రువులమాటా? హా! హా! నాకంతమం దూపిరియాడునంతవఱకును శత్రువుల జీవములో నిటకు రానిచ్చుటే?

ప్ర:—అయంశమందు నీకు నే వెనుదియ్యను. ప్రియదర్శనుడు నాకన్న చిక్కువ తమ్ముడు కాడు నీకు-ధర్మ్యయుద్ధము కావలెనంటిని గాని వేఱొండుకాదు. వీరాగ్రేసరులైన పితాజీవారైనను క్షుద్రపాంచాలబలములకు వెఱచి యన్న మాటకాదు. నీవొక్కడవే సమర్థుడవని నీవే భ్రాతృవాత్సల్యము బాఱగొంటి వని భ్రమయకు.

అ:—అట్లయిన మాఱుమాటాడక యుద్ధానకు నడుముకట్టు. నేనిదివఱకే యేలికల పేర యుద్ధ మంగీకరించి పాంచాలపురాయబారులను బంపివేసినాను. మన దండనాథునికి సమరసన్నాహ మాజ్ఞాపించినాను. ఈపాటికి మనసీమాంతదుర్గ ము లన్నిటను మనయభీష్టము వాయువేగముతో బ్రసరించి పరదురాసదములై యుండును. మఱి తడయబనిలేదు. శత్రువుల నురుమాడి చిరకీర్తి భరతఖండ మందటను చెలకొల్పి మహాతేజస్కాములగు జనకులవాస్తవపుత్రుల మనిపించు కొని వారిహృదయారవిందము గందళింపజేతుముగాక.

ధ:—ఓరి సాహసికుడా!......(ఆశ్చర్యనిమగ్నుడై నిశ్చేష్టితుడై కూర్చుండును.)

(తెర)

---

## చతుర్థాంకము - ద్వితీయరంగము.

---

(కాశ్మీరదేశపుదక్షిణపు పొలిమేరనున్న రామనగరగిరిదుర్గము. కోటను ముట్టడించు పాంచాలసేన కభిముఖుడై, యాయుధపాణియై, సర్వసేనానాయకుని ముస్తాబుతో యశోవంతుడు ప్రవేశించును-లోపలనుండి సేనాసమ్మర్దసంకులముతో గలసి రణభేరికాదివాద్యములు వినబడును)-

య:—(తానిలువబడిన గిరిశృంగమున కనతిదూరమున నాత్యుచ్ఛ్రితమగు యుద్ధరంగము దిలకించునట్లభినయించుచు అత్యుత్కంఠతో)

భళిర, ప్రియభటులార! వహ్వారె సత్య
వీరులార, మఱొక్కింత విడక పూన్కి
జిక్కబట్టుడి జయలక్ష్మి సిద్ధమయ్యె—
జన్మభూమానగత్రాప్రశస్తి గొనుడు—

2. సత్యసంగరమే గాని సల్పరెన్న
డోటమెఱుగరు పాంచాలయోధవరులు—
భవఫలమె గాదె పూర్వులపరువు ముడువు
బదిగ పోచ్చించి సుతుల కర్పణముసేత?

ఆ! అదే యూవు-దాని సడలింపక తిన్నగా కోటగర్భమునకు మార్గము భేదించి కాని వ్రాలదగుదు. మీకాలునకు కోటతలుపులు తమంతన వీడిపోయి యందలి భాగ్యలక్ష్మి మీపాలబడకుండునా? ఈవడువున సమస్తావరోధదుర్గముల నిర్జించి మరుచటిగెలనాడు శత్రురాజధానియందు దురాశయుడగు శత్రుని గుండియపై జయపతాకము పాతించునట్లు నాపాలిదైవ మనుగ్రహింపకుండునా? (ఇంచు కాలోచించి) ఏమి యీసంకులము? కాని సేనలు కోటవంకనే మూగుచున్నవి—నావైపునకు జెదరుట లేదు. ఇట్టి మహావసరమందు పావనశ్లోకులగు రణసింహమహారాజులయాశీః ప్రభావమే నాకును నాబలములకును శ్రీరామరక్ష-

(ఒకయోధుడు తొందరగా ప్రవేశించును.)

యో:—(రక్తసిక్తవస్త్రములతో నతిదుర్బలస్థితితో గుండెల రెండుచేతులతో నత్తిపట్టి పెనుబాధను సూచించునట్లు పడ్డుపలుమారు కరచుకొనుచు, ఒగర్చుచు,

మాటలాడుట కూపిరియాడక) జయించినాము. మహాప్రభూ! ఏలికలు దక్షిణ కాశ్మీరమునకు ప్రభువులైనారు.

య:—ధర్మో జయతు! స్వామీ, యిష్టదైవమా, నీదే యీప్రతాపము. నాసేనలపేర నీవే సాధర్మ్యయుద్ధమును బోరి జయించినావు!! (యోధునితో) తొందర పడకు- కొంతసేద దేరు- కూర్చో.

యో:—(నిస్త్రాణముగా) స్వామీ, తొలిజయము మనది. ఏలికలబిరుదునిశానీల నిప్పుడే కోటబురుజుపై నెలకొల్పినాను.

య:—రాజభటా! చిరాయువు గమ్ము! (ముఖము దేఱిపాఱ జూచి) నీకారోగ్యమే గదా.

యో:—నా కేకొదువయును లేదు. కాని శత్రుబలము సామాన్యముకాదు. మన తూఱునకు గూలిన కోటతలుపులపై జరిగినదొమ్మిలో మునుముందు లోనికి జొచ్చిన మనదుర్ధర్షవీరులపటాలమునంతటిని జంపినారు. దళపతిశరీరము జల్లెడై ప్రాణావశిష్టుడైనాడు.

య:—ఎవరు? అజితసింహుడే?

యో:—చిత్తము- (రానురాను మఱింత నీరసముగా) కాని మహావీరుడు. సమూలముగా బూచిన మోదుగువలె ధనుర్ధరుడై సేనాముఖమునుండి చెదరక, ఎట జూచిన దానయై, కందకముపై గూలినవంతెననెక్కియు, ద్వారమునడ్డగించు కొను శత్రుబలముల భేదించియు, లోలోనికిం జొచ్చి సర్వతోముఖమగు నగ్నిజ్వాలయట్లు నలుదెసల దఱిమి నురుమాడియు, శత్రువుపాలిటి లయకాలరుద్రుడై విజృంభించి కోటగర్భమందు సేనలతో దూసుక చొచ్చినాడు.

య:—ఓహో పాంచాలకులతిలకమా! నీభుజము నాశ్రయించిన నారాజ్యమాన మెంతగా వన్నెకెక్కినది!

యో:—ఇంతలో సేనొడలెఱుంగక ప్రభువులదివ్యనామస్మరణప్రభావమున నెట్లు చేరితినో గాని, పరభయంకరమైన యేలికలజెండా బురుజుపై బాతి సింహనాదము జేయు నవసరమున నీనారసము (బట్టలు తప్పించి చూపుచు) నాగుండెలు వ్రక్కలు చేసినది. ప్రాణమంకరించినను ఉత్సాహబలము నూతగాగొని యేలికలపాదములపై దేహ మప్పగింపవచ్చినాను-

య:—అయ్యో పాపము!

యో:—మహాప్రభూ! నాజన్మము సార్థకమైనది. నన్ను గడుపారగని చేతులార బెంచిన దేశమాతను సేవించుచు దేహత్యాగము జేయుభాగ్యము నాకు లభించినది?

య:—వీరోత్తమా! నీపరాక్రముచే మానవత్వ ముజ్జగించి దేవసన్నిభుడవై సకలమానవకోటికిని స్తుతిపాత్రుడ వైనావు. పరమపవిత్రమైన నీదర్శనమున నాపాప సంచయ మెల్లను క్షీణించినది. నీయట్టి యవస్థ మహాతపఃఫలముగా గోరి తెచ్చుకొనదగినది- నీకేమైన గోర్కు లున్నవా?

యో:—ఎన్ని జన్మములకైన యశోవంతమహారాజు సేవయే లభింపవలయును. దేవా, హా! శ్రమపెట్టుచున్న దీబాణము-

(యశోవంతుడు బాణము నూడదీయునవస్థలో దెఱ దింపపలయును.)

---

## చతుర్థాంకము-తృతీయరంగము.

---

(కాశ్మీరసేనలో శ్రుతకీర్తిడేరాముంగల)

(శ్రుతకీర్తియును, శ్యాలకుడగు నరసింహుడును, మాతులుడగు ప్రతాపార్కుడును కూర్చునియుండగా చారుడు ప్రవేశించును.)

చా:— రాజాధిరాజా, పరవీరభయంకరా, జోహారు! స్వామీ, నేటి సమరవృత్తాంతము విన్నవింప నానతి వేడెద—ఏలికలకు తొలిజయము చంద్రభాగాతీరమందు నేడు సమకూరినది. ఇంతటినుండి శత్రువు పాదాక్రాంతు డగుపఱకును దదేశదిగ్విజయమే కాగలదు.

శ్రు:—ఆ! చెప్పు, చెప్పు. ఎట్టిజయము లభించినది? సెబాస్!!

చా:—మహాప్రభూ, మనవీరులకు జోడినవీరులు జగత్తులో లేరు. యోధపురరాజ్యాధిపత్యమున నాగ్నేయ దిశనుండి మిడుతలదండుపలె లెక్కకు మిక్కిలియై వచ్చు శత్రుసేనలం జూచి వెఱచి నట్లభినయించుచు దేశమాద్యంతము నిర్మానుష్యముగా వదిలిపెట్టినారు. శత్రువులు దుర్మదావిష్టులై ప్రాల్మాలి యాపలించుకొనుచు కొందఱినుకయెడారిని, మఱికొందఱు వఱదలకుప్పొంగి యొడ్డు తెలియక బరువుగా బాఱు నేటిప్రవాహమందును మెల్లగా జరుగునవస్థలో నిరుప్రక్కలనుండి భూగర్భ మీనెనా యనునట్లు పదారువేలసంఖ్యగల మనమహారథులు గజోష్ట్రారూఢులై ప్రావృట్కాలమేఘములు నక్షత్రమండలము నలుకొసల

# స్వర్ణచూతము

నావరించినట్లు కనుమూసి తెరచునంతలోపల ముట్టడించి శరవర్షము గురియించియూ, అందినంతవఱకు కరవాలముల ఛేదించియు జక్కడగించి యూ చంద్రభాగను నెత్తుటివెల్లువగా జేసి పాఱించినారు. ఉన్నమట్టుకు వెనుకకు మఱలుట కశక్యమై ముందుకు పరుగెత్తి యివతలిగట్టునకు సగముచచ్చి చేరుకొనునప్పటికి గట్టువెనుకటి కొండశిఖరముపై నుండి కొండవిరిగిపడినట్లు పైకురికి మనపోటుబంట్లు శత్రుభటు డొక్కడు మిగులకుండ నిరంతరబాణానల జ్వాలలం బఱపి చెండుమిండాడినారు.

న:—ఇంత సాహసనైపుణ్యములు నేనెన్నడును వినియుండలేదు.

ప్ర:—మాటొగ్గి పులిని వేటాడినట్టయినది. వహవా! కాశ్మీరసేనకే చెల్లిం దీబిరుదు, సింహపిల్లలవంటి కాశ్మీరకుమారులకును! నాడు సేనాముఖాన మీనల్వురు నాలుగుదనలకును భద్రగజములపై నధిష్ఠించి దిక్పాలకుల ధిక్కరించు ప్రాభవముతో రణభేరీస్వనములతో దిక్కుల పిక్కటిల్లగా రాజధానినుండి యూరేగునప్పుడు శిశువనితావృద్ధులంగూడ పరాక్రమావేశము పరవశముజేసి యెత్తైదు చేతులు వ్రాల్చక మ్రొక్కేవారు కొందఱు, ఆరతులు పట్టేవారు, సేసలు జల్లేవారు, పుష్పాంజలు లిచ్చేవారు కొందఱు, నగరమంతా నిర్జీవప్రతిమమై యస్మదాదుల నట్టిట్టనరానియహంకారభావముతో నించివేసింది. ఇదంతా మాబావగారి పరిపాలనాఫలము. మీనల్వురును వారికి నాలుగు మహావరములు - దేవసన్నిధులు. దేవేంద్రున కీవైభవములేదు. మీయంతంత మాణిక్యాలిస్తే యెడమకాలితో తోసివేసి మిమ్ముల నెంచుకొంటాను.

న:—మాబావలను నాకిచ్చివేస్తే నలుగురినీ నాలుగువందలకమ్మి సొమ్ముచేసికొందును! అందులో మాచిన్నబావను పాంచాలరాజు కమ్మితే యిప్పట్లో నాకర్థరాజ్యం యిస్తాడు.

ప్ర:—ఆ, దూదిబస్తాలో నిప్పుదాచినట్టే. ప్రియదర్శనకుమారుడు ప్రేమ కర్పూర చందనం, వైరానికి దావాగ్నిన్నీ. ఆతనిని జూచి మగవాళ్ళకే కామవికారం పుట్టుకొచ్చి అయ్యో! స్త్రీజన్మ యెందుకెత్తియూము కాముగా అని యేడుపొస్తుంది. ఆదేవేంద్రుడికికూడా అతన్నొకమాటుమాట్లాడించి, అతనిపరిచర్య చేసి పోకపోతే జన్మవ్యర్థమనితోపించేటివి కాదుటోయి ప్రియకుమారుడిదీ!

ప్ర:—మాబావవంటి బుద్ధిశాలి యొకమాటు అత్తవారింటికి వెళ్లి దీలం దొంగిలించి

చూర్లో దాచుకొన్నాడట కాదూ? ఇంతే కాదు, ఇతనికర్ధరాజ్యం యిస్తే రాజ్యం పనీ అంతే. చూర్లో దీపం దాచుకున్నట్టే-చల్లని ప్రభువు! హా!హా!హా!

న:—బావా, పాంచాలులేతన్మాత్రులుగారు సుమీ! రణసింహమహారాజు ప్రజలఖండ ప్రభుభక్తిగలవారు. యుద్ధము దలపెట్టిన యుత్తరక్షణమందు బిలువకే లక్షల కొలది యువజనము ప్రతిజనపదమునుండియు కొంగి పొర్లివచ్చి పేరువ్రాయించుకొని రాష్ట్రసేవ కుద్యుక్తులైనారు. క్షత్రియములైన భూస్వామ్యము నమ్ముకొని గుఱ్ఱములను, ఆయుధములను గొనుకొన్నారు. ఇప్పటికనేకస్థలములందు ధనురాచార్యులవలన రణశిక్షితులగుచున్నారు. ఆరుమాసములనాటికి సమగ్ర రణకోవిదులు మఱి యిరువదిలక్ష లిప్పటియోధులకు దోడుకాగలరు. కోసల, మండీ, చంబా, నేపాళ, యోధపుర, మత్స్యపుర, ప్రతాపగడ, కాశీ, వైరాట ప్రముఖమహారాజులు తమతమసేనలతో సహాయసంపత్తి నించినారు. శత్రురాజధానిమొదలు, మనపొలిమేరవఱకుం గలభూమి చమూభారముతో గడగడవడకి యాక్రోశించుచున్నది.

ప్ర:—చాల్చాలు! నావీ, మారాజుగారువీ కలిసి యిరవైవేలవక్కాగున్నా లన్నాదట! ఎందుకు? తినబోతూ రుచు లడగడం యెందుకూ? మఱొక్కానెలరోజుల్లో మనంవే అనుకుంటాం! చీమలపుట్టకి చిచ్చెట్టేసెయ్యాం ఆటయ్యా! వెఱ్ఱిమాట లాడకావేం!

శు:—ఎంతమంది రానీ! సమభూమిమీదనైతే మనసంఖ్యలు చాలవేమో కాని, గిరికాననములందు తలపడితే మనవాళ్లు ఒక్కొక్కడు పదేసివేలకుబంటు—మన కొండవాళ్లమాయలు వాళ్లకే తగును. చంద్రభాగవద్ద యేమైనదో అంతటా ఆదేఅవుతుంది.

ప్ర:—వాళ్లలో ఒకాడేనా, కొండ అన్నది చూశాడూ జన్మయెత్తి? కాలెడితే పాతాళంముట్టేదాకా దించుకుపోయేమట్టే కాదూ ఆపాంచాలం అంతానూ?

(ఆదిత్యుడు ప్రవేశించును)

న:—బావగారు సంకల్పసిద్ధులు—చంద్రభాగావిజయముమాట విన్నారా?

ఆ:—ఆదేపాటిజయము. రామనగర మేపాటి యపజయము? తుద ముట్టించునది తెక్కాగాని.

అందఱు:—ఆదేమి?

అ:—మీరు వినలేదూ? రామనగరదుర్గము శత్రువున కధీనమైనది. అచ్చటి మనయూ రక్షకసేనయంతయు తెఱలోబడినది. బావా, మీయన్న యదృష్టదేవతను గుత్తకు పుచ్చుకొన్నాడోయి! శత్రువులన్నము బాగా పెట్టిపుట్టినాడు. ఎందఱు చావనీ, యెన్నికోటలు పడనీ మనవాడు కూర్చున్నచోటనుంచి కదలనక్కర లేదు. సామంతం చేసి సకలరాజోపచారాలూ చేయించుకోవచ్చును- ఇదంతా ఆలోచించకే ఆక్కడిసేనాధిపత్యం కోరుకొన్నా డనుకొన్నావూ?

న:—అయ్యో పాపము! ఎన్ని ఊహాలుచేసినాడు! ఎన్నియెత్తు లెత్తినాడు! ఎంత ఆశపడినాడు!

అ:—అయితే మాబాగా విక్రమించినాడట! మనబలను నాలుగురెట్లు శత్రువులను జంపి మళ్ళీ స్వాధీనమైనది.

ప్ర:—ఈపాటికి తనసత్తువూ యెదిరిసత్తువూ బాగా తెలిసే వుంటుంది. ఇంకా బుద్ధి రాకపోతే వాడికర్మం—తన్నుల్తినేయోగం వుంటే తెలియదు.

అ:—కాని శుష్కవాదములతో ప్రయోజనములేదు. శత్రువు దక్షిణసీమనంతటను నిండియున్నాడు. ఆటంకములను తోసుకవచ్చుచున్నాడు. అన్నయ్యా! మీరుత్తరు విచ్చితిరేని నేనందులకు బోయి యాప్రదేశమును సంరక్షించు నేర్పాటు గావించెదను.

శు:—అచ్చటికి ప్రియదర్శనుడు వెళ్ళియేయున్నాడు. నీవు రాజధానికి సమీపమం దుండవలెను.

(దౌవారికుడు ప్రవేశించును)

దౌ:—స్వామీ, పాంచాలదేశపురాయబారులు దర్శనము వేడుచున్నారు.

శు:—రమ్మను. (దౌవారికుడు నిష్క్రమించును)

ప్ర:—ఎందుకో! ఇంతలో పశ్చాత్తాపం వచ్చిందా? నాయనా, సంధికోరితే మనం అంగీకరించవద్దు సుమీ.

అ:—లేదు, లేదు. ఏదో మఱొక్కమాటు బెదరించడానికి—సంధియే? మఱి పదేళ్లకు సంధి కుదిరితే నేడు కుదిరినట్లు— (రాయబారులు ప్రవేశింతురు)

రా:—స్వామీ, మేము పాంచాలీయులము. ఏలికలదర్శనమునకై మాప్రభువులపంపున వచ్చినాము.

శు:—ఏమి మీరాజుగారిసందేశము?

రా:—దేవర కిట్లు విన్నవింపుడని:—మీవివేకము మఱొక్కతరి బరిశీలింతురు గాక. "తొలుదొల్త మీరే యుద్ధమునకును దన్నిమిత్తప్రజాక్షయమునకును బ్రేరకులైనారు. ఇప్పుడైనను దక్షిణను విడచి మాసొత్తు మాకధీనము గావింపుడు. మీ పంతము ధర్మసమ్మతము గాదు. అందులఫలము తోఁతో నగుపించినది. ఆరుమాసములలో నాలుగుకోటలును లక్షజనమును గోల్పోయినారు. మఱి యారుమాసములలో మీరాజధానిని వశపఱచుకొని మీరాజ్యము నాక్రమించుకొందుము. అప్పుడు మీరు శరణంబొచ్చి ప్రయోజనములేదు. మీసోదరుడు మీకు బ్రియుండేని నాతని నుంచుకొండి. మాదక్షిణను మాకంపివేయుండి."

ప్ర:—ఏమిపొగరెక్కినాడు మీరాజు! చంద్రభాగావృత్తాంతము వినలేదు కాబోలు! ఓదరినుంచి మీరాజ్యం ముట్టిస్తూన్నారు మావాళ్లూను-ఆమాట యింకా తెలియదా యేమిటి? మారాజధాని నాక్రమించడమే! అక్కడొక పదిమందిని యిక్కడొకపదారుగురిని బిచ్చమెత్తి సేనం గూర్చుకొన్నాడు. చేతనైతే రావలసిందే గాని సంధికోరడ మేమి?

రా:—మహాప్రభూ! వీరెవరు(ప్రతాపార్కునుద్దేశించి) ఈమాటలే తమ ప్రత్యుత్తరమా?

ప్ర:—నేప్రతాపార్కమహారాజును-మా మేనల్లుళ్ల మేనమామను-మా బావగారికిచ్చినది మాఅక్కగారే సాక్షాత్తూను - మిమ్మన్ని పారిపోనివ్వం. రానివ్వం-చూడు నా పౌరుషం.

ఆ:—మామహారాజునానతిగా నీప్రత్యుత్తర మందింపుడు మీరాజునకు- "యుద్ధకారణము మాపక్షమునుండి రాలేదని యీవఱకే బుద్ధిచెప్పినాము. దేశయాత్రావశమున బంధుసందర్శనమునకై వచ్చిన యమాయికపుబసిబాలుని జెఱచిన మీ కొండలికతమున మీపై మాకెంతయుద్ధకారణము కగినదేమో రూచింపవేమి? ఈయపచారమునకే గదా మీరాజ్యముపై దండయాత్రకు మాసేనల నంపియున్నాము. అందుకు భయపడి యీమాట జెప్పలేక ధర్మమంతయు నీవే గుత్తకు బుచ్చుకొన్నట్టు ధర్మముపేరు చెప్పుకొనినను, యిటు ఆటు తగిలే చెంపకాయలు తప్పించుకొందువు! పారిపోవుటకు ఇక్కనిమిష గల్పించుకొన్నావు! వివేకము లేకున్నను చాతుర్యమునకు లోపములేదు. మారాజ్యమాక్రమించుకొందువు కాబోలు! అంతటివాడవైతే నీమఱది నేల రోసుకొన్నావు కావు? ఇంటగెల్వనివాడవు రచ్చనెట్లు గెల్తువు? ఇప్పుడైనను మాయాటంకములేదు. ఆమెనిండుమనస్సుతో మీవెంటవత్తునన్నచో మీరు కొనిపోవచ్చును. మేము బలాత్కరించి పంపము."

శ్రు:—ఎవరక్కడ? చారు డేడీ?

(చారుడు ప్రవేశించును.)

ఈపాంచాలీయులకు క్షేమసంవాహనము గావింపుమని దండనాథునికిం జెప్పు.

(చారుడును, రాయబారులును నిష్క్రమింతురు.)

(ఆదిత్యునితో) తమ్ముడా, నీవిచ్చటనే యుండి రాజధానిని రక్షించు సన్నాహము ప్రబలముగా నొనర్పదగు. నరసింహుడు నీకు తోడగును. విశ్వావసుడును ప్రియదర్శనుడును ప్రాగ్దక్షిణముల కేగెదరు. మామయు, నేనును పశ్చిమాగ్నేయములకు దరలుదుము. నీవిటనుండి సహస్రాక్షుడవై సమస్తసేనా విన్యాసములను జక్కగా గావించుచుండవలయు. ధనసాధనసామగ్రిని జక్కగా నేకగించి కాశ్మీరరాజ్యలక్ష్మికి మేధవై, స్త్రీబాలవృద్ధజనమునకు ధైర్యమూర్తివై కాపాడుము.

(అందఱు నొకరినొకరు కౌగిలించుకొని నిష్క్రమింతురు).

---

## చతుర్థాంకము - చతుర్థరంగము.



(శ్రీనగరమునకు దక్షిణభాగమందలి మహాదేవగిరిశృంగమున వెలసిన యీశ్వరాలయము. దోసిట బుష్పము లుంచుకొని పరమభక్తితో దన్మయుండై యశోవంతుడు ప్రవేశించును. కాలము రాత్రి-)

యః:— పాట.

పల్లవి శరణు శివా। హే శరణు భవా। శరణు శరణు జగన్నుతవిభవా॥

1. గిరిశసురా। శ్రితచరణా। క్లేశహరణచణ, భవశరణా।
స్మరమగకాననదహనా। కరుణాలయ గిరిజాప్రియ జయజయ॥శరణు॥

2. కావవెవన్ కరుణారససింధూ। కలరెవరికనిన్ గావనిబంధుల్।
దేవవరా। త్రిపురహరా। శరణాగతభరణాతురశంకర! శరణు॥

3. నీదయమా। లినమనికేలా। నిర్మాతృకమగు నీడములీలా।
వేదనుగా। ప్రియుడనుగా। భేదముసేయకు పాయకు। నీదాసులకుం దాసుడ ॥శరణు॥

శంభూ,జగత్పావనా, దివ్యమందాకినీవాః ప్రపూరప్రభాభాసమానోత్తమాంగా, హరా, సర్వలోకస్థితివ్యక్తభవ్యప్రభావా,భవా, భావజాహంకృతిచ్ఛేదనోద్యోగి ఫాలాక్ష, దక్షాధ్వరధ్వంసి వీరప్రతాపోదయా, ధూర్జటీ, దీనలోకైక బంధూ,

సురేంద్రాది దివ్యాఘకోటీరకోటీతటీ భ్రాజదస్తోకమాణిక్యమాలాఘృణీవారబాలార్కదివ్యప్రకాశోజ్జ్వలత్పాదపంకేరుహా, శర్వ, సర్వజ్ఞ, సర్వేశ్వరా, సర్వశక్తీ, శివా, సంతతానందసందోహసంధాయకా, దేవదేవా, నమస్తే నమస్తే (సాష్టాంగపడిలేచి, చేతులుజోడించి) తండ్రీ నాయిష్టదైవమా, భవదీయకృపా మహిమంబునంగదా సేటివఱకు జయమొంది ధర్మవైరియగు వైరిబలంబుల దప్పించుకొని తత్సామ్రాజ్యాయుస్థానమనందగు భవత్పరిపాలిత దుర్గముం జేరినాను. నీమహిమ గొనియాడ నేనెంతవాడను! దేవా, నాపాపముల బరిహరించి నీకటాక్షమునకుం బాత్రునిగావించి, నన్ను, నాసేనలను, గాపాడుము. నాగమ్యస్థానమును నాయాసల నిదానమునగు శత్రురాజధాని యదే దిగువలోవలో నిరంతర కాంతారపరీవృతమై నిద్రించుచున్నది. అతిశీఘ్రముగా నేనయ్యెడ జయపతాక నిల్పి యభీష్టసిద్ధి యగునటు లనుగ్రహించి, శాశ్వతధర్మగోప్తవగు నీశాసనము నిర్వర్తించిన ప్రతిష్ఠచే నాజన్మ సార్థకము గావింపు మోసకలలోకాధారా, భక్తమందారా, నిరంతరతేజోనిదానా, పరమపావనా, (సాష్టాంగపడి, మఱిమఱి చేతులజోడించి మఱలును.)

(ఇద్దరు పాంచాలభటులు ప్రవేశింతురు)

ప్రథమభటుడు:— ఎవరక్కడ?

య:— నే శివభక్తుడను. నాయనా, మీరెవరు? శత్రువీరులలాగున్నారే?

ద్వి-భ.— ఔను, మీరాజ్యమాక్రమించడానికొచ్చాం. మీరాజువీపు బిఠగ్గొట్టడానికి. నీవెవడవు-నీవృత్తియేమి?

య:—(భయ మభినయించుచు) బాబూ, రాజోటికి రాకండి, ఈశ్వరదర్శనం చేసుకొని వూళ్లోకి పోతాను.

ప్ర-భ:—నీదగ్గిర యేం వుందో అక్కడపెట్టు.

య:—(వడకుచు) నన్ను బాధించకండి నాయనా, నేధర్మకర్తను-నిర్దోషిని-తపశ్శాలిని.

ప్ర-భ:—అలా చెప్పు-(ఒడలు తడవి చూచి) యీవస్తువులన్నీ దేవద్రవ్యమే కాదూ? నీవు దేవుణ్ని దోచుకుంటె నిన్ను మేము దోచుకుంటాం, నీనిలువుదోపు పుచ్చుకొని మరీ విడిచిపెడతాం.

య:— పాంచాలరాజు పరమధర్మమూర్తి యనిచెప్పుకుంటున్నాం, యిక్కడ మేమంతా.

ద్వి-భ.— తప్పక్రియాలకేంలే. మారాజును పొగిడితే మాకేం వుంది?

ప్ర-భ.— నీవిస్తావా, మేం తీసుకోమా? (మొలనున్న సంచియ దీసి జతిపించును).

య:— మీకో వుపకారం చేస్తా, నన్ను బాధించకుండా వుంటె.

ప్ర-భ:—యేమిటి?

య:—(రహస్యముగా) మీకు శ్రీనగరానికి దగ్గిరతోవ చెప్తా.

ద్వి-భ:—హా! హా! ఇదా? మారాజుకు చెప్పు-మా కేలోవైతే యేం? మారాజుతో చెప్తే నీకు లాభం చేస్తాడు.

య:—ఆలాభంలో సఘం మీకిస్తా-నన్ను మీరాజుదగ్గిరకు తీసుకుపొండి.

ప్ర-భ:—ఏమి సత్తెకాలం! రాజు కుపకారంచేసి, రాజుచనవరివై, మమ్మల్ని తన్నించడానికి. పెట్టవయ్యా, అక్కడ యీమాటలు చాలా యెరుగుదుము మేము.

య:—నన్నొంటరిగా పట్టుకొని యీలా నిర్బంధిస్తారా? అందులో దేవుని సన్నిధానమందు? అంతదూరాన్నించి వచ్చారు, ప్రాణాలు మిగుల్చుకొని పెళ్లాం బిడ్డల్ని చూసుకోవాలని లేదూ, పాపాత్ములారా?

ప్ర-భ:—మాగడిసరిలాగున్నాడ్రోయి, యీబాపనాడు! భయపెట్టి దోజ్జేదాం అని చూస్తూన్నాడు.

ద్వి-భ:—ఆమాటకొస్తే నాపెళ్లాం నేటతక్కపోతేనే సంతోషిస్తుంది.

య:—ఆయితే యెవరికోసం యీతాపత్రయం అంతా?

ద్వి-భ:—ఉందిలెండి...అంతా... ఆఁ...!

ప్ర-భ:—వాడిపింతండ్రి కొడుకుమీద దానికి రంగు. అదిచూస్తే యీయధపకి దుఖ్ఖం.

ద్వి-భ:—అయితే బాఖూ, వోతగువు చెప్పండి—.

ప్ర-భ:—ఏడిచినట్టు వుంది యధవసొద! ఎక్కడికెళ్లినా యిదే మొట్ట-నావస్తువులు నాకక్కడ పెట్టవయ్యా-పెడతావా, తమ్మిట్లు తెంపుకోనా?

య:—(ద్వి-భ. తో) మీరాజుతో ఫిర్యాదు చేయలేక పోయినావూ?

ప్ర-భ:—పెట్టిమాటలాడతా వేమిటయ్యా, ధర్మకర్తవైయుండిన్నీ? రాజుతో ఫిర్యాదుచేసేది, రాజు అబ్బతో చేసేది. ఆముండకి మరోహడిమీద మనుసుకుదిరియాక, బ్రహ్మశక్యం అటయ్యా, మార్చడం? మారాజొహడికి బుద్ధుందీ? మన్లో మనిమాట-ఆకాశ్మీరరాజుకొడుకును తగులుకుపోతే ఆమరదలు ముండకోసం వద్నాలుగు భువనాలూ వెల్లగించి పేగులు తెంచుకొని వాడిపై దండెత్తడాని కీలాగ మాప్రాణాలన్నీ పుచ్చుకుంటూ వున్నాడు. చచ్చిచెడి గెల్చుకొని తీసుక పోతా డనుకో. యేం ప్రయోజనం చెప్పూ! ఆపారేయేరు కొండతలపై కెక్కించి పారిరచ దలచుకొన్నట్టే హా! హా! హా!

(దళపతి ప్రవేశించును)

దః—(తొందరగా) మహాప్రభూ, త్వరగా దయచేయవలెను. శత్రువు నలుదెసలనుండియు ముంచుకవచ్చినాడు. లెక్కలేనట్టగుపించుయుద్ధవీరు లశ్వారూఢులై యాయుధపాణులై పరుసపై పరుసగా నన్నికొండల కనుములను లోవలను తటాకించి మనలను బుడ్డిలో బెట్టి మూతవేసినట్లు బిగించినారు. మఱియొక్కక్షణములో సుడిగాలివలె వచ్చి మీదబడ సుద్యుక్తులైనట్టు తోచుచున్నది. ఇట్టి సమయమందేలిక లాత్మరక్షణమందు బ్రాల్మాలి యుండదగదు. అక్కడక్కడ చెదిరినమనసైన్యము నొక్కటిగా గూర్చుచున్నాము. తడవగుచున్నది. నాకు శలవిప్పింపుడు.

య:—శివచరణాంభోజము లాశ్రయించినవాని కెన్నటను భయములేదు. పద-మీగందఱు నప్రమత్తులై యెవరితావున వారు నిల్చి కార్యక్రమము నెరవేర్పుడు.

ద:—చిత్తము (పోబోవును).

య:—నాశిబిరమందు నన్ను గనుంగొనుము.

ద:—చిత్తము (పోబోవును).

య:—ఇదిగో ఈయిరుర్వురను నీవశమందుంచి మేము కోరినప్పుడెదుట బెట్టు(భటులు గడగడ వడకుదురు).

(దళపతి, యిరువురిముఖముల దేఱిపాఱచూచి నడపించుక పోవును)

య:—ఇంతటిది, రాజుబ్రతుకు! అందఱిపనియొను దనది. తనపని యెవ్వనిది గాదు. ఎదుటనున్నప్పుడే వినయోక్తులు, సాష్టాంగదండప్రణామములును. సుంత వెనుదిరిగినా, వెక్కిరింతలే. ప్రచ్ఛన్నవేషము దాల్చి తన్నుదా గాదన్నగాని ప్రజాహృదయము కానరాదు. అభిముఖులైనప్పు డెల్లరును బరమాప్తులే. లోకమంతయు సురలోకమే. బ్రతుకంతయు నందనవిహారమే. నిజము తెలియవలెనన్న స్వత్వము దాచి మఱచి లోకమును గనుపూరాయ పలయును. భువనలాస్వాదమునకై తనప్రజయందధమాధమునికున్న సౌకర్యము తనకు లేదుగద! పేరున కధికారము. క్రియ కస్వతంత్రత-పైకి తళుకు-లోపల జిజ్ఞాస-చూచుకొనుటకు రాజ్యరాజ్యాంగసంపత్తి-అనుభవించుటకు జన్నుగుడిచి బొమ్మ గుద్దుపామరప్రజలకృతఘ్నత, యధిక్షేపము, అసూయ, అపకృతియు. ఇస్సీ! యీపరయోముఖ నిన్నకుంభ విగాహాంకప్పక్షి. యీ మెప్పుగానని చాకిరీ-ఛీ-

(ఆయుధపాణియై ప్రియదర్శనుడు కోపోద్దీపితయై యిరంధ్రమనుమగా ప్రవేశించును)

ప్రి:—దొరికినావురా నేటికి! ఏమొగంబెట్టుకు వచ్చినావు, లేచిపోయిన మగువలను వెదికికొనుచు? నా కాళ్లుపట్టుక బ్రతిమాలి నన్ను వలచినది. తలవంచుకొని రెండవవానికి దెలియన ట్లొకమూల దాగికొనక యుద్ధానికి వచ్చినావా? సరే, దిగు, కాచుకో-నేడు నా కత్తికి బలి యైనావు. నీ క్రొన్నెత్తుటితో నీరాత్రి మహాదేవేశ్వరున కభిషేకము గావింతుగాక (కత్తి దూసి మీదికి వచ్చును).

య:—(మొలనుండి ఖడ్గము దూసి) ఓరీ, ద్రోహీ, నరాధమా, పాపాత్ముడా, నీ చేసిన కృతఘ్నతకు దగినశిక్షకై నాకే మాట దక్కించినావు. కాని నిన్ను జంపను-నాగుఱ్ఱపుదోకకు నిన్ను విరచికట్టి మా రాజధానివీధులంట నీడ్చి నీకును నీవంటి దైత్యాధములకును బుద్ధి జెప్పుదునుగాక. (ఇద్దరును బోరాడుదురు. కాశ్మీర పాంచాల ప్రముఖులు కలువురు రంగము నిరుప్రక్కలనుండివచ్చి యెదుర్కొందురు యశోవంతుడు ప్రియదర్శనునిపైబడి దుర్బలుంజేసి కాళ్సేతులు విరచి కట్టు నవసరమున ప్రోజ్జ్వలపాత్రములకదృశ్యయై యతనివెనుక నిలువబడి కేల దాకునప్పటికి ప్రియదర్శనుని కమానుషశక్తి కలిగి కట్లను ద్రెంపుకొని కాలయమునింబోలె యశోవంతునిపై కుఱికి కత్తితో నరకబోగా హీరాదేవి, యదృ పాత్రములకదృశ్యయై తనడాలు నడ్డము పెట్టి దానిమీద నా దెబ్బల నందికొనును).

ప్రి:—(యశోవంతుని దఱుముచు) పిఱికిపందా, పాఱిపోకు.

య:—అవాచ్యుడా, పాపమూర్తీ, నిలు, నిలు, ఎంతసేపాదుర్నయుని ప్రాణము రక్షించుకొందువు? (ఇరువురు నొకనియంటి యొకడు రంగముపై రెండుమార్లు తిరిగి నిష్క్రమింతురు.)

(అందఱును నిష్క్రమింతురు.)

శ్రీ ర స్తు.

# స్వప్నచూడము

## పంచమాంకము - ప్రథమరంగము.

---

(శ్రీనగరమందలి యొకవీథి)

(ఒకవైపున శారికాద్రియను నొకపర్వతశిఖరమును, దానియెదుట గోపాద్రియను మరియొక శిఖరమును, నడుమనడుమ నక్షీచెక్కిన దేవదారుఫలకములతో నిర్మింపబడిన పది పన్నెండేసి యంతస్థులుగల మేడలతో గిక్కిరిసిన యిరుకువీథులు- వీథులకు నడుమ విటస్థానదీశాఖలు - అందుపై బల్లకట్టు వడవలు- ఎడనెడ చిత్రవర్ణములుగల పుష్పములసంఖ్యాకములుగా వికసించి కను విందు సేయు లతాగృహములు. కొండచరులందు దేవదారు కర్పూరాదితరువులచే బలసి విరివిగా బెరుగు నరణ్యములు. కొండలన్నిటికిని నిగనిగమను తెల్లనిమంచుకిరీటము- కాలము మధ్యాహ్నము - సన్నని పొగవంటి పొగమంచు నలుగడల నావరించియుండును).

(ఒకయింటివెలుపలిచావడిలో నొంటరిగా గూర్చుండి, యరచేతను గెడ్డముననాని కొని పరధ్యానముగా సుప్రత సన్న్యాసివేషముతో ప్రవేశించును.)

సు.—ఔరా, యొకదాని నంటి యొకటి, యెన్నిదినములు, మాసములు, పక్షములు చల్లగా కప్పదాట్లు వైచినవి! నేనిటకు వచ్చి నిన్ననట్లు కాన్పించుచున్నది. మూడుసంవత్సరములును మూడునిమిషములట్లు గడచినవి. ఈ మహావకాశమునంతటిని దాటించినది ప్రతిక్షణప్రవర్ధమానమగు ఫలోత్కంఠగాక వేఱొండుగాదు. కాని యింతనిరంతరోద్గ్రీవముగా వేచియున్న యదృష్టదేవతాప్రసాదము నేటిదనుక గాలిమూటకట్టుటకన్న నెక్కువ కాదయ్యెను. క్రమముగా నిప్పుడా యుత్సాహబలమంతయు రోగవేదనోపశాంతికై సేవించిన మద్యబలమట్లు తగ్గి మునుపటికన్న వేయురెట్లు చిత్తదౌర్బల్యముం గొల్పి లొంగదీయుచున్నది. తుదకు మిగిలెడిదే యిదేమో! శాకిదృష్టికింతకన్న వేఱగుపర్యవసానము పొడకట్టకున్నది. కాకేమి? నాకై దైవము లోకపరి

పాలనాక్రమము మార్చునో! నేనే సృష్టియంతటికిని ఫలభోక్త్రి, నా? అయ్యో అయ్యో! బ్రతుకా, యేమిసీ ఘోరోత్తరములు? అట్లని నిరాశగావించుకొన నుం గూడదు. ఏచాటునుండి యేవిధముగా గార్యసిద్ధి వాటిల్ల నున్నదో! సాంసారికభాగ్యాభాగ్యముల తెన్నేయింత-కారణాభాసములనుండి మహాఫలములు లభించును. అపాత్రములందు మహదైశ్వర్యము పట్టును. సత్పాత్రములు పిడుగు మొత్తినచెట్టులాగున సపుష్పఫలముగా నెండి, జాలిగొల్పుచుండును. ఎట్లనో యజ్ఞాత సంప్రాప్తములగుఖేదమోదములు గొనుచుండుటకన్న మనకు జేతనైన దేదియులేదు.

నామాటటుంచి, అయ్యోసమస్తపురుషార్థములును జాలిగొనగా నవతరించిన నా ప్రాణవల్లభునకు సూర్యునకు రాహుగ్రహణమట్లీపాపగ్రహావేశమేల? ఈయప కీర్తియేల? ఈదీర్ఘసమరక్లేశమేల? ఏవెఱవున నాథునిసన్నిధిం జేరి యింత యుప చారము సేయగలదాన? దైవపౌరుషములు రెండును సమానముగానే భంగపెట్టి నవి! ఈమహాసంగ్రామము కడతేరు టెక్కడ, నేనాథునిం గూడి పాదసేవ సేయుటెక్కడ! పాంచాలురు బలముచేతను, కాశ్మీరీయులు సాహసముచేతను సమానముగా నుద్రేకించి యున్నారు. కాని యాశ యడుగులేని గని-పురుషకారము సహస్రధారల వజ్రాయుధము. దైవము సుధామయప్రహరణము. ప్రాణములు గలంతవఱకును భయములేదు. క్లేశములు దుర్భేదపాశములుకావు. దైవమా నాపౌరుషమును బ్రేరించి విజయాగ్రమున బ్రతిష్ఠింప నను గ్రహింపుము. (భక్తిపరవశయై కన్నులు మోడ్చి చేతుల జోడించి ధ్యానించును)-

పలుకనేర్చినదాదిగా బరమపురుష
నిన్ను గీర్తింతు గల్యాణనిలయముగను,
బాలకేళిగ నీపాదపంకజముల
నమ్మి సేవింతు భవశరణంబటంచు

(నిరాశావిషాదము లుత్కటమైయేడ్చుచు)

2. తప్పుతోచె నీవె దండించినావన్న
మచ్చు సూతొ భవము మత్సరింతొ?
పూజ కలరవేని బొరపాట్ల కలుగుదూ—
చేరకున్న దన్న చింతవిడతు !!!

అంతరిక్షమంతయుం దళుక్కుమని వెలిగి యొక్కక్షణము తాళి సుమేధ ప్రవేశించును.

సుమే:—(సుప్రతం జేరి యభయహస్తము దాల్చి)

పున్నె మూలదీవి, సంపెంగపూవుదాని
నఖిలవనవీధి సురభిళ మైనరీతి
నీదుభద్రశీలతఁ గూర్మి నియతిఁ దాల్చి
నిఖిలయావతమును మాననీయమయ్యె!

2· సంశయింతో సౌశీల్యంపుసార్థకతలు!
నెఱికి పరికింతో విశ్వాసబీజ మిట్లు'—
విధివిధిత్వంబు, వేల్పులవేల్పుదనము
చెల్లునెటు సత్క్రియల్ ఫలసిద్ధిగానక !

3. పరమభక్తి సంతప్తమై భద్రశీల
ముద్రితంబైన నీపూజ ముదము నించి
శివపదద్వయిరత్నమంజీర మయ్యె,
దయ విజృంభించె నీవాంఛితము ఫలించె.

(సుప్రతా ధ్యానతత్పర యైయున్నపుడే సుమేధ యదృశ్యయగును. సుప్రత తటాలున నిద్రనుండి మేల్కొనినట్లు కన్నులు తెఱచి, సాగిలి)

తండ్రీ యార్తశరణ్యా, సకలలోకైకబంధూ, నీయనుగ్రహమునకుం దగిన దానగా దేవా, ప్రాకృతవాంఛాపరవశను, పరనుపాసనా, దివ్యక్షమాపరిపూర్ణా—నీదీన రక్షణ పతితపావనతాత్పర్యమే కారణముగాని! మహాదేవదేవేశ్వరా! నాభర్తను గాపాడి క్షేమమూలమున నన్ను ధన్యంగా నెంపు మోమంగళాలయా, భద్రసంకల్పా, భద్రాత్మకా ! ! !

(తెర)

## పంచమాంకము - ద్వితీయరంగము.



(శ్రీనగరమునకీశాన్యమూలనున్న గోపాద్రిదుర్గము)

(పాంచాల యువరాజగు కుశలుడును, సేనాసాధుడగు సురేశ్వరసింహుడును రంగము నిరుదెసలనుండి వచ్చి కలియుదురు.)

కాలము మధ్యాహ్నము.

కు:—(ఎండనుండి కన్నులకు జేతితో జాటు పెట్టుకొని) ఓహో! మాకుశలకుమారు నల్లే యగపట్టుచున్నారు- వెదకబోయినతీగ కాళ్లకు దగులుకొన్నది.

కు:—సురేశ్వరా, మనసేనలకుం గుశలమే కద?

సు:—చిత్తము మహాప్రభూ, కాని యుద్ధముమాత్రము మహాప్రబలముగా జరిగినది. కిరాతమాయలకు మనదండు సరకుసేయలేదు. ఇప్పుడు కోటచుట్టును ముట్టడి వైచియున్నారు. కాశ్మీరీయులు రాజ్యప్రాణావనావేశముచే నోడకెలియుంగక ఘోరయుద్ధము జేయుచున్నారు. నలుగడలనున్న శత్రుసేనలన్నియు నిచ్చటకు మూగినవి. గోడలమీద కెక్కి శరవర్షము మనపై గురియించినారు. మన సేనలో పూరుషవంతులు మడియుటం జూచి శత్రుసేనామహార్ణవ ముప్పొంగి లోపలనుండి యొక్కపెట్టున దోసుకవచ్చి మనపైబడ నుద్యుక్తులగుసమయమందు దైవంపుకంపున నాగ్నేయమునుండి ఖుందేలీలదండువచ్చి మనలో గలిసి యనన్యసామాన్యముగా విక్రమించి విజృంభింపజొచ్చినది. దానింజూచి యాప్రయత్నము విడచుకొన్నారు.

కు:—శత్రుపుదళవాయి యెవరు?

సు:— ఆదిత్యకుమారుడు - అతనికి సహకారి నరసింహుడు.

కు:—నీవేల యేమరి యున్నావు?

సు:—స్వామీ యేలికలను గోటలోనికి గొంపోవచ్చినాను మనకు సంపూర్ణవిజయము తప్పదు.

కు:—సెబాస్! అహా, యేమి సహజసౌందర్యభాజనమో యి, యీదేశము !

సు:—అకనబడునదియే శత్రునృరాజధాని శ్రీనగరరాజ్యలక్ష్మి విలసిల్లు తూగుటుయ్యేలకిది యొకదండె. ఆయెదుటశారికాద్రి రెండవదండె. అలోపనుండు హంసకారండవాదిజలపక్షిసేవితమై సంతతవసంతావాసమనోహరోద్యానముల కిరవగు ద్వీపములచే నెడనెడ నావరింపబడిన యా"ఢాల"సరస్సే యానీలావణ్యరాశి. దానిజీవనాగులే ఆసహస్రశాఖలుగాగ్గి నగరము నన్నిదెసలను వ్యాపించి వెలుగొందు విటస్థానగీతుల్యలూ. యుద్ధములేనినా డందుపై నెల్లెడను జక్కని వంతెనలు వెలసియుండెడివి. అతిమనోజ్ఞములగు నావలు తేలుచుండెడివి. ఇప్పుడు మనరాక నిరోధించుటకై వానినెల్ల శత్రువు తీసివేసినాడు.

కు:—అకొండచరియలందలి పచ్చికపట్లెంత మృదుమధురముగ నున్నవో చూడు! అనదుమనున్న దేవాలయమో—

సు:—అదే కాశ్మీరరాజులదేవత యగుశారికాదేవి యాలయము.

సు:—ఓహో! యెంతసౌందర్యము! ఒక్కకొండయును గొడ్డుదికాదు. ఆకొం దలపోకచూడు. ప్రకృతికన్యాలలామము చెలికత్తెలతో నాడుకొనుచు వినో దమునకై కట్టిన పిచ్చికగూళ్లవలె నొకదానిపై నొకటి కనుచూపుమేర గగనాలీన మై మూగి యెంతరమ్యమైనవి!

ను:—మహాప్రభూ, ఇది దేవభూమి, ఇచ్చటి వారు గంధర్వులు.

(ఒకపాంచాలభటుడు ప్రవేశించును)

భ:—(తొందరగా పరతెంచివచ్చుచు) మహాప్రభూ, మనసేనలు లొంగిపోయినవి. శత్రుబలములు మనలను ముంచివేసినవి. కొండగుహలలోనుండి యీగెసిల్లపుట్ట లాగ లెక్కలేని కొండవాళ్లు వచ్చి మనసేనలను పైనుండి ముట్టడించి సింహనా దము చేసేటప్పటికి, లోపలనుంచి తలుపులు తీసుకుని యీగారక్షకసేన వెలువడి రెంటిమధ్యను మనసేనలను నొక్కివేసినారు. నేనేలాగునో తప్పించుకు వచ్చి నాను. మీరిక్కడుండరాదు. కాశ్మీరభటులు చెలరేగి రణతాండవ మాడుచు న్నారు- పరుగెత్తండి, దాగండి, లెండి, మరి ప్రశ్నలకు వేళలేదు.

(ఇంతలో రంగము నిరుదెసనుండి కేకలువేయుచు నుభయపక్షభటులును పరు గెత్తుకవచ్చి పోరాడుచు తిరిగి యిటునటు పారిపోవుచు కుశలసుకేశ్వరుల ముట్టడించి నలుగురేసి కాశ్మీరీయులు గండెకావడివన్ని యెత్తుక పారిపోదురు.)

(తెర)

---

## పంచమాంకము - తృతీయరంగము.

---

(శ్రీనగరపుగోటలోని రాజనగరునందు ఉద్యానవనము. ప్రమోదాదేవియు, దక్షిణయు ముఖాముఖిగా కూర్చుండి ప్రవేశింతురు.)

ప్ర:—అందులో నిద్దరు కవలవాండ్రున్నారట కాదూ. ఎవరో? వారిని మించిన పరాక్రమశాలురు లేరట!—

ద:—వారిద్దరే నాసహోదరులు- రామలక్ష్మణులవంటి మహారథులు- అశ్వనులవంటి తేజశ్శాలురు- మాతండ్రి విద్యున్మాలి యనుగంధర్వశేఖరుడు- ధనుర్విద్యా విశారదుడు- విలాసపంచాస్త్రుడు- ఒకనాటి నిండు పున్నమరాత్రి వియత్పథ మందు కేలివిహారము జేయువాడై మాళవరాజధానిలో రాజభవనోద్యానమందు వెన్నెలకు పన్నీరుద్దుతచ్ఛాయాపూరంబు తోచింబుగా విగంధమాల వెలింగించు

ప్ర:—బ్రతికి యున్నాడా? నాదివ్యకుమారశేఖరునొద్దకు నన్ను గొనిపో-ఇప్పు డెచ్చటనున్నాడు?

చా:—అమ్మా యేలికలకు దెలియని ధర్మము లేదు. ఇట్టిసమయమందు రాణివాసము విడువవలదు. శత్రు పుత్కటమాత్సర్యశీలుడైయున్నాడు.

ప్ర:—ఏమైన గానీ, నన్ను నాయమృతంపు జెలమయొద్దకు గొనిపొమ్ము.

ద:—నాప్రాణవల్లభుడు శత్రుపరాధీనుడై యుండుసు గాబోలు.

చా:—లేదు. ఘాటీశిఖరతల ప్రక్కనున్న మనకర్పూరమాలాప్రాసాదమం దిష్టదేవతా పరిపాలనమున సేదదేరియున్నాడు దివ్యపురుషుడనందగునొకతపోధనుడు సిద్ధౌషధముల నిచ్చుచున్నాడు.

ప్ర:—అదియెట్లు? శత్రువు విడచినాడూ సాకుమారుని?

చా:—ఆవెంటనే మనవీరులు యశోవంతుని పైబడి విరచికట్టి చెఱబెట్టినారు. ఇంతలో నుభయపక్షముల ప్రముఖులును నాటియుద్ధము విరమించి తాత్కాలికసంధి గావించుకొన్నారు. ప్రియదర్శనకుమారుని మనయధీనమం దుంచుటకును, మన చెఱలోనున్న కుశలయశోవంతులను మనము చిత్రవధ చేయకుండుటకును-

ప్ర:—అట్లయిన నాయుష్మంతుడు సజీవుడై స్వజనపరిశోషితుడై సురక్షితుడైయున్నాడు.

చా:—ఆ-ఏమియు శంకింపవద్దు.

ప్ర:—దైవమా, నాపుత్రిని బ్రదికించి నాకు బుత్రభిక్ష మిడి రక్షింపు- మహాదేవేశ్వరా, శారికాంబా మహాశక్తీ మమ్మిట్టియుపద్రవములనుండి కాపాడుడు.

ద:—మమ్మటకు గొనిపో-

ప్ర:—ఔను లెమ్ము. (నిష్క్రమింతురు)

---

పంచమాంకము - చతుర్థరంగము.

---

పీర్ పంజల్ ఘాటీలోపలికోనయందు గర్పూరమాల యనుమేడ- ఎనిమిదియంతస్థులు గలది. ప్రక్క నొక సరస్సు-చుట్టును కొండపోకలును-కర్పూరాదికాననమును-దిగువను శ్రీనగరపులోవ-ఒకపెద్దపడకగదిలో మెత్తని పట్టుపరుపులపైని తెల్లపట్టుదుప్పట్లశయ్యపై దలకును బొమ్మునకును తెల్లనిబట్టలతో గట్టినకట్లతో నొడలి తెలివిలేకుండ బరున్న ప్రియదర్శనుడును, ప్రక్కను సన్న్యాసివేషముతో నేలగూర్చుండి కుడిచేయి

ప్ర:—కామమోహితునికిని దేహాభిమానికిని భావ్యనర్థము లెట్లు పొడకట్టును? అదునుకు వివేక మక్కఱరాదు. కార్యభంగ మైనపిదప నిరర్థకపశ్చాత్తాపము కలుగుచుండును. మామహారాజు నాతో జెప్పలేదా? ఐననేమి, యీ యుద్ధము కేవలావివేకసంభవము కాదు. ప్రియపుత్త్రకునికొఱకు నీపొందును, నీకొఱకు యుద్ధమును అనివార్యము లైనవి. రానున్నది రానీ. యుద్ధమునకు వెఱచి యుంటిమేని, నీకొఱకు రాకొమరుడును, వానికొఱకై నేనును, నన్నుగూర్చి సమస్త రాజకుటుంబమును నాటికినాడే నశింపవలసివచ్చును. ఇన్నిసంవత్సరములు మనము జీవించి యుంటిమంటే మహాప్రసాదమని దేవుని గొనియాడుదము.

ద:—అమ్మా, యేమో గాని నేడు నామనస్సునకు మహాపాపశంక తోచుచున్నది. నేను గదా యీ ప్రజాక్షయమునకు హేతువునైనాను. నన్నుండిగదా నిరంతర సౌహార్దభాజనం బగు మీకుటుంబమునకు బరస్పరవైమనస్యమును. నిర్వ్యాజ సంతుష్టికిం బుట్టినిల్లగు మీరాజ్యమునకు సంక్షోభమును వాటిల్లినవి?

ప్ర:—అట్లన నేల. నిన్నుండిగాక పోయినచో బరమకల్యాణకాముడగు నాప్రియదర్శనుని గన్నులారగానక నేదేహము చాలింపవలసివచ్చును.

ద:—అయ్యో, నాజన్మము విషకరండమై నన్నును లోకమును గూడ దహించివైచినది. ధర్మవిధిగా బరిణయమైనవల్లభు నాశ్రయించి శుభాశుభములు దైవాధీనము లని యొక్కకాపురము నమ్ముకొను కులకాంతలసౌభాగ్యమునకై నోచుకొనక పోతిని-దుర్బుద్ధిచే నిహపరముల రెంటిని జేతులారా వ్యర్థపుచ్చిన నాకల్మషముచే దనూశతంబులకు జాలినవిపత్సంచయము నేకరించికొంటిని.

ప్ర:—అమ్మాయీ, యీతరుణము దాడవలసినమాటలు కావివి. నీయావన్నోబలమును గూడబెట్టుకొని నీప్రియునకు హితము గోరుకొనుము-మనకీసంగ్రామమందు జయము లభింపవలయునని నీపాలిదైవములకు మ్రొక్కుకొనుము.

ద.—అయ్యో, నే నేమొగముతో దైవము వేడగలను నాశీలము పవిత్రమైనదనియా? నాయుద్ధము ధర్మయుద్ధమనియా? నామట్టుకు నాకేమనోదార్ఢ్యము లేకున్నది. నాజన్మము విఫలమైనది. ధర్మదూరుని కవితాచమత్కృతివోలె నాసౌందర్యాది గుణములు చేటువాటించినవి. ఇంద్రియ పారవశ్యముచే నన్ను గంధర్వాది కాంతల కుమించి పొగడిన కామాతుర యువజనము మాటలకును జేష్టలకును నుబ్బి నేనే జగదీశ్వరినని తక్కటి యువతులెల్లరు గాకాలి గోటికి జాలరని భ్రమపడి స్వతంత్రనై, కులటనై, ప్రజామారినై, హా దైవమా!!.

(చారుడు ప్రవేశించును)

ప్ర:—భైరవా, యేమి యుద్ధవృత్తాంతములు?

చా:—అధీశ్వరా, గోపాద్రి దుర్గమునొద్ద మన సేనలు శత్రువును గీటడగించినవి.

ప్ర:—అంతవఱకును వచ్చినారా, శత్రువులు?

చా:—పాంచాల యువరాజును గళవాయియగు సురేశ్వరునిం జెఱగొన్నాము.

ప్ర:—కుశలునే?

ద:—వహవా! జయతు కాశ్మీరసేనా!!

ప్ర:—తరువాత—?

చా:—అచ్చట భగ్నాశయుండై, శత్రువు మనదక్షిణకవాటమైన పీర్ పంజల్ ఘాటీ యొద్ద పూనికరెట్టించి గణనాతీతబలసమృద్ధితో నాటంకము లన్నిటిని ఛేదించుకొని యుల్కాపాతమట్లు తోసుకవచ్చినాడు. (కొంత సంశయించును)

ప్ర:—చెప్పు, చెప్పు-గెల్చినామా మనము?

చా:—అచ్చట ప్రియదర్శన కుమారుడు "అమరుల"ని పేరుగల దోర్గాదండునకు దండనాథుడై సహస్రాక్షుడై పరిపాలించుచుండెను.

ద:—అం—?

చా:—ఎదిరి బలములు పాంచాలరాజే స్వయముగా తోడుకవచ్చి శిశిరర్తువునందు ధావళిరుచిపై బారులుగట్టి యాకాశమునంతటి పాదవ్రసను మూగెడు కొంగల దండువలె నలుగడనుండియు గ్రమ్మించినారు. పదిపదాఱురాజ్యములసేన లచ్చట గలసినవని నాతలంపు.

ప్ర:—పర్యవసాన మేమైనది చెప్పవేమి?

చా:—మనవైర మారంభించినది మొదలుకొంత ఘోరసమము జరిగి యుండలేదు-పాంచాలరాజు తనహృదయశూలమైన ప్రియదర్శనకుమారునితో మరల యుద్ధము లభించినదని మహాకుతూహలముతో దనయుద్ధనైపుణ్యమంతటి నొక్కమారు కూడదీసికొని నిరతిశయజిత్వరతతో నానావిధాయుధములతో బోరినాడు. మన బలములు "యశో వా మృత్యుర్వా"యను తమశపథము సార్థకముగా శత్రుసేనా ప్రవాహమును సహస్రబాహార్జునులై యరికట్టి వచ్చిన త్రోవను మరలించి లోయకు బదారు క్రోశముల దూరము వెంట దరిమినారు.

ప్ర:—ఆహాహా! నాజన్మ కింతకన్న ఫలితమేమి? వీరాధివీరుడగు నానాయన నెదుర్కొని తప్పించుకొనగలిగిన యోధు డెంతవాడు కావలయును?

ద:—కార్తికేయునివంటి నానాథుని పరాక్రమజ్వాల కడ్డమేది రాగలదు?

చా:—ఇంతటి యశోవంతుడు తనసేనకుం గలిగిన పరాభవము సహింపలేక యెదురు తిరిగి యెదిరి దన్నుం గానక రణరంగమం దంతటను ఆయుధముల విసరుచు ప్రియదర్శనుం దూలనాడుచు మన్మహానాశనమ్మాదముతో నటు తాండవమాడు నప్పటికి మనవీరులు పైబడి యుక్కిరిబిక్కిరిమార్గమునో నవతుని జేసినారు.

ద—బాపురే!

చా—మహాదేవులారా, స్త్రీయము చెదరక చిక్కబట్టు మపిరి యెటుజరుగుటకును దైవము బలీయము. సుంచికిని జెడ్డకును మనకెంతమాత్రమును కర్తృత్వము లేదు.

ప్ర:—ఏమి జరిగినది? నాప్రియకుమారునికిం గుశలమేకద!

చా:—యశోవంతుడు పట్టుబడక మున్నతనికిని ప్రియదర్శనకుమారునికిని బాహాబా హిని విచిత్రయుద్ధము జరిగినది చెంతనుండి నిశ్చేష్టితుడనై నాకన్నులతో జూ చినది నేనప్పు లేకపోతిని. ఆమహావీరులకే యొండొరుశక్తులు కత్యద్భుతమైనట్టు మాకగుపించినది. యశోవంతునికి మనవారు మగలువేసిన సంకెళ్లు తమంతన వీడి దుర్వారుడై నలువంకలనుండి కురియు శరవృష్టిని తృణప్రాయముగా మసిపివేయుచు తిన్నగా ప్రియదర్శనకుమారు నెదుర్కొని పట్టబోవు నప్పటికి గాని స్రోగుజేయు యత్నమటు చేతులు తేలిపోయినవి ఇతనిఘోరకరవాల ప్రహారము లతని పైబడి గాయనగుదై తేలిపోయినవి. ఈవిధముగా బోరిపోరి యలసి కొంతతడవు కూర్చుండి మగిడి లేచువంతలో కుమారునురము పైకురికి రెండు ముక్కలగునట్లు చీల్చినాడు. హాహాత్మసు- (గద్గదస్వరముతో)

ప్ర:—హా దివ్యకుమార సుకుమారా! హామున్ని) మకమకుమారా! హా ప్రియదర్శనా! శశాంక మనోజ్ఞదర్శనా! అనామకుడవై యజ్ఞాతవాసమందే యుండిన నింత గా దైవము నీపై జలపట్టియుండదేమో గదరా! అయ్యో నాకు జ్ఞాపకముచేసి మరల యింతఘాతము వచ్చినా వేమిరా! (మూర్ఛిల్లును).

ద:—హానిర్జిత పంచశరా! హామజ్జనభాగమా! నాకేమిగతి చెప్పినావు, గేరివ్వారి పాలబడుదును ప్రాణవల్లభా! నిన్ను నమ్మి సర్వధర్మపరిత్యాగము జేసినాను. ఆత్మహత్య జేసికొన్నను నీవేగిన వీరస్వర్గమున కెట్లు చేరుదును! హాక్రూరదైవ మా! నాకిటు నటును గూడ ఘాత బన్నినావా!

చా:—మహారాజ్ఞమణులారా, ఓదార్చుడు- కుమారునికి గాఢశస్త్రమాలి తగిలినదిగాని-

ప్ర:—బ్రతికియున్నాడా? నాప్రియకుమారశేఖరునొద్దకు నన్ను గొనిపో—ఇప్పు డెచ్చటనున్నాడు?

చా:—అమ్మా యేలికలకు దెలియని ధర్మము లేదు. ఇట్టిసమయమందు రాణివాసము విడువవలదు. శత్రు వుత్కటమాత్సర్యశీలుడైయున్నాడు.

ప్ర:—ఏమైన గానీ, నన్ను నాయమృతంపుజెలమయొద్దకు గొనిపొమ్ము.

ద—నాప్రాణవల్లభుడు శత్రుపరాధీనుడై యుండుసు గాబోలు.

చా:—లేదు. ఘాటీశిఖరతలప్రక్కనున్న మనకర్పూరమాలాప్రాసాదమం దిష్టదేవతా పరిపాలనమున నేడదేరియున్నాడు దివ్యపురుషుడనందగునొకతపోధనుడు సిద్ధౌషధముల నిచ్చుచున్నాడు.

ప్ర:—అదియెట్లు? శత్రువు విడచినాడూ నాకుమారుని?

చా:—ఆవెంటనే మనవీరులు యశోవంతుని పైబడి నిరచికట్టి చెఱబెట్టినారు. ఇంతలో నుభయపక్షముల ప్రముఖులును నాటియుద్ధము విరమించి తాత్కాలికసంధి గావించుకొన్నారు. ప్రియదర్శనకుమారుని మనయధీనమం దుంచుటకును, మన చెఱలోనున్న కుశలయశోవంతునిను మనము చిత్రవధ చేయకుండుటకును—

ప్ర:—అట్లయిన నాయుష్మంతుడు సజీవుడై స్వజనపరివేష్టితుడై సురక్షితుడైయున్నాడు.

చా:—ఆ-ఏమియు శంకింపవద్దు.

ప్ర:—దైవమా, నాపుత్రిని ప్రదికించి నాకు బత్రభిక్ష మిడి రక్షింపు— మహాదేవేశ్వరా, శారికాంబా మహాశక్తీ మమ్మిట్టియాపద్రవములనుండి కాపాడుడు.

ద:—మమ్మటకు గొనిపో—

ప్ర:—ఔను లెమ్ము. (నిష్క్రమింతురు)

---

పంచమాంకము - చతుర్థరంగము.

---

పీర్‌పంజల్‌ఘాటీలోపరికోనయందు గర్పూరమాల యనుమేడ- ఎనిమిదియంతస్థులు గలది. ప్రక్క నొక సరస్సు-చుట్టును కొండపోకలును-కర్పూరాదికాననమును-దిగువను శ్రీనగరపులోవ-ఒకపెద్దపడకగదిలో మెత్తని పట్టుపరుపులపైని తెల్లపట్టుదుప్పట్లశయ్యపై దలకును బొమ్మునకును తెల్లనిబట్టలతో గట్టినకట్లతో నొడలి తెలివిలేకుండ బరున్న ప్రియదర్శనుడును, ప్రక్కను సన్యాసివేషముతో నేలగూర్చుండి కుడిచేయి

భర్తచేలినాడిపై నుంచి పరిశీలించుచు సువ్రతయును ప్రవేసింతురు. సువ్రతకు వెనుక సుమేధ ప్రసన్నముఖియై యొకకుర్చీమీద బాత్రముల కగపడనట్లు కూర్చుండును. సువ్రత చేలికందినంత దూరములో జిన్నబల్లలపై నౌషధములు వెదురుగొట్టములలోను బోకపాత్రులతోను ప్రదర్శింపవలెను. రెండుబంగారు చెంబులతో నుదకము, రెండు బంగారుగిన్నెలలో బాలు, ఫలములు, భక్ష్యములు. గాయములకు గట్టుటకు గుడ్డలు చికిత్సాసామగ్రి-

సువ్ర:— సేవకశేవధీ నిను భజించినవారికి దైన్యమేల? వి
శ్వావన విశ్వపావన సమర్థుడవున్ గరుణామయుండ వౌ
నీవె నిరాకరింప నికనే మఱి యెవ్వరి గొల్తు? గ్లేశమిం
కేవిధి గెల్తు దండ్రి! చలమేల కటా! శరణంటి గావుమా!!

2. విందును విశ్వభర్తవని విందును విశ్వహితైషివందు నిన్
విందు జగచ్ఛరణ్యమని విందును భక్తవశుండ వందు మి
న్నందుదు నాకు దిక్కని భవాంబుధి పిక్కలబంటి యందు నా
కెందుల కిట్టివంచన? భజించినవారి త్యజింతురే ఘనుల్?

తండ్రీ యార్తరక్షామణీ, దేవదేవా ప్రపన్నపారిజాతా నాప్రాణాధికధనమైన భర్తను శోడపెట్టక నన్నురక్షింపనొల్లవా? ఐదుదీర్ఘవత్సరములు రేబగళ్లు పరితపించిన నాకింతటి దుర్భరదురవస్థలోనా భర్తృసమాగమము జేసి తపస్సిద్ధి గావింతువు! అపార మహీమోన్నతుడవగు నిన్నాశ్రయించియును ఖండఫలమేనా? ఇదియునుంగాక యీనవ కిసలయకోమలశరీరమున కింతక్రూరశస్త్రాహతి నీయాచిత్యపరిపాలనాశీలమున క్షేమి తార్కణ? నీయనంతకల్యాణశీలముంగూర్చి నేనొందిన సంశయములకై యీశిక్ష బన్నినావా? కాని నేనల్పజ్ఞనల్పాశయను నీవు జగత్కూటించివి. లోకతంత్రమునకై నీవన్నినపన్నికలు నీసృష్టియందొక్కరేణువునైన నాకు సద్యఃఫలముగాకుండెనని నే విసుగవచ్చునా? నిరతిశయకల్యాణసంకల్పుడ వగునీసంకల్పమే నెరవేరనిమ్ము. నాకు నీపాదసంస్మరణమే శరణము. నీవు నన్ను విడనాడవని నానింతనమ్మకము.

కొలిచెద నిన్ మహామహు నకుంఠితతేజు సమానసత్వు శ్రీ
నిలయు నశేషలోకవరణీయు శుభోదయు విశ్వమోహనో
జ్జ్వలకమనీయు విశ్వనుతిభాజను మత్సుకృతైకభోక్తగా
గలుషవిదారిగా విహితుగా శరణంబుగ భాగ్యనేతగా.

2. కొలిచెద నిన్ జగద్భరణకోవిదు జన్మమరుప్రపాయితా
మలకరుణాకటాక్షు బహుమాన్య గరిష్ఠు వరిష్ఠు ధర్మని
శ్చలకరుణాంతకోపను విశంకటశాసను మద్ధితజ్ఞు ని
స్తులమహిమోన్నతోన్నతు విశుద్ధపవిత్రచరిత్రు నీశ్వరున్.

ప్రి:—(ఒత్తిగిలి యింకను బూర్ణచైతన్యమురా నట్లభినయించుచు గాల్సేతులు చాచుకొని యరమోడ్పుకనుదోయితో) సువ్రత, సువ్రతాదేవి,(తిరిగి యస్వస్థతనభినయించి యిటునటు దొరలిపరుండును).

సువ్ర:—(హర్షమానద్భుతమును నటించుచు) కరుణానిధీ, నాపాలిభగవంతుడా నీమహిమోన్నతిచే బరమధన్యనైతిని. నాప్రాణవల్లభుడు బ్రదికినాడు. అవివేకముతో దేహత్యాగముజేసికొన సుంకించిన నామందబుద్ధిని నేటియీశుభముకొఱకై సవరించినావు. నాయౌషధము సార్థకమైనది- కాని యింతటి మహాపస్మారావస్థలో గూడ నన్నుస్మరించుమూర్తికి జన్మశతములకొలంది బలికి నాసమర్పింపగలుగు దాస్యముచేతనైన ఋణవిముక్తి నొందను. (ఔషధము గాయముల కలది, నస్యము వాసన జూపును)

ప్రి:—(మఱల మేల్కొని మునుపటి కన్న నెక్కువగా గాల్సేతులు కదపుచు, సగము లేచి కూర్చుండబోయి యింకనరమోడ్పు కన్నులతో) సువ్రత - పాటలానదీ సుపుత్రి - మేఘమేఖలకులావతంసము - దానియొద్దనున్న సంజీవితో గాక నే బ్రతుకను.

సువ్ర:—(మఱల నౌషధ మలది నస్యము వాసన జూపుచు) మహాప్రభూ, ఏలాగు నున్నది?

ప్రి:—సువ్రత నిటకుం గొనిరారూ? నన్ను బ్రతికింపరూ? (కొంతసే పూరకుండి) సువ్రత-సు-వ్ర-త (సువ్రత తిరిగి తిరిగి యౌషధ మలదుచు నాడిబరిశీలించుచు బరమోత్సాహము నటించును)

ప్రి:—లేచి (కూర్చుండి కన్నులు తెఱచి, నలుదెసలుజూచి, యించుకాయాసముతో నూపిరిదీయుచు) నేనెక్కడ నున్నాను? ఘాటీయుద్ధ మేమైనది?

సు:—స్వామీ, మనమే గెల్చికొన్నాము. పాంచాలరాజు మనకధీను డైనాడు.

ప్రి:—ఎక్కడ నున్నాడు?

సు:—చెరసాలలో.

ప్రి:—చబాష్-మీరెవ్వరు?

సు:—నేనొక బైరాగిని-దేశయాత్రలు చేయుచు నిటకేతెంచి యీతరుణమం దేని కలవు గొంతయౌషధాద్యుపచారములను జేయుచున్నాను.

త్రి:—కాని యేమి యాశ్చర్యము! స్వప్నమునకును సత్యమునకు నెంతదూరమో! నేనిద్రించిలేచు నంతలో వచ్చిన స్వప్నవృత్తాంతము విన్నారా? సూర్యమండలముం దాటి తత్తేజోఽభిభవోన్నతిని ధిక్కరించు నొకమహాపట్టణమట. అయ్యెడ నేను దివ్యవిమానమునధిష్ఠించి యనేకసామంతసుభటశ్రేణి బలసికొలువ దేవేంద్రపదవితో నేగితినట. కానిలోనికిబ్రవేశింపకము న్నే ద్వారమునొద్ద సాధ్వీశిరోమణి, సువ్రతాదేవి నన్నభినందించి, లోనుండి సహస్రబాహువులతో నన్ను రమ్మనిపిలుచునట్టి రంభోర్వశీప్రముఖసుందరీమణులస్వాగతమును, నే వారింగూడు సంరంభమును బలాత్కారముతో నిరోధించి నన్నెత్తుకొనివచ్చి జననీజనకుల యుత్సంగము జేర్చినదట!

సు:—మహాప్రభూ, దేవరు వీరస్వర్గము సందర్శించి వచ్చినారు. ఇప్పుడు మీ దేహపీడ యెట్లున్నది?

త్రి:—పరమతపోధనా, అడుగుదురేల? మీయౌషధము నాకమృతప్రాయమైనది. నాడులక్ష్మణుడు మూర్ఛసిల్లినపుడు ఆంజనేయుడు సంజీవి బోసినట్లు నన్ను బ్రదికించినారు. నాపునర్జన్మమునకుగారణమై నాకు బితృప్రాయులైనారు. మీఋణమెట్లు తీర్చుకొందును? (లేచి యడుగులపై వ్రాలును)

సు:—(అడ్డగించు కొనుచు) రాజసింహమా, మీర ట్లనదగదు. మీరు కారణజన్ములు. స్వోపకారముకొఱకే మిమ్ములను బ్రతికించుకొన్నాను మీకుబునర్జన్మ మిచ్చినందుకు మనమిర్వురము భగవంతుని బ్రశంసింతము మీరనేకజీవరాసుల కాధారభూతులు.

త్రి:—మీరే నాపాలి ప్రత్యక్షభగవంతులు (ఏడ్చుచు) నాయుత్తమాత్మయగు దక్షిణయు నేనును మీకత్యంతకృతజ్ఞులము-

సు:—స్వామీ, దక్షిణ యెవ్వరు?

త్రి:—మీరెఱుగరా? దక్షిణ జగజ్జ్యోత్స్న-నామనోనాయకి-నాబహిఃప్రాణము.

సు:—నేనొకసువ్రతనే యెఱుంగుదును. ఆమె మీకుబరమానురక్త.

త్రి:—సువ్రత సుప్రసన్నయై నాయెనర్చిన ప్రేమమునెరించి యీచికిత్స మీచే నంపియుండబోలు. దానికిట్టి సిద్ధక్రియ వింధ్యాద్రిపతి పుట్టువుగానుకగా నిచ్చినాడు.

సు:—ఆమెకు మీరేమి ద్రోహము జేసినారు? ఆమెకు మీరేమి కావలయును?

ప్రి:—నేనింతవఱకు కాయాపథము సువ్రతందాటి లోకమం దెయ్యెడను లేదను కొంటిని. లేక మీరూపముతో నన్ను బ్రదికింపవచ్చినదా! అయినచో స్వప్నము నిజమే యగును.

సు:—ఆయిల్లా లట్లుచేయ కుంట వింతగాని చేయుట వింతకాదు-

ప్రి:—ఔనౌను, నాయెడల నామె పరమక్షమా ధరిత్రియే. కాని యంతటిజగద్ధాత్రి యైనను నాదౌర్జన్యము సైరించునని నేనమ్మను.

సు:—మీయోగ్యత యిట్టిదికాదు. మీచెట్టబట్టిన యేవనిత మీకనువ్రతకాదు? ఎన్ని జన్మములతపస్సు ఫలించినంగాని మీయట్టి ప్రణయమూర్తుల ధర్మపత్ని యగుభాగ్యము లభించును—భవ్యశీలా?

ప్రి:—సువ్రతా?

సు:—భవ్యశీలా! (తలపైనుండు జటామకుటము దీసివేసి ప్రియదర్శనుడు విడచిన నాటినిజశిరస్సును జూపించును)

ప్రి:—హా! ఎన్నాళ్ళకామధురాలాపములు వీనులవిందుచేసెనే! (యేడ్చును) చిఱుత ప్రాయమందాటలలో నీవు నాకిచ్చినబిరుదిది. కాని నేబాపిని. ద్రోహిని. నీపొగడ్తలు నిరర్థకము చేసినాను. నీతగుల మారడిపుచ్చినాను. నీయోగ్యతకు బాత్రుడను గాను. నాయపరాధము మన్నించు. నాద్రోహము మఱొక్కతరి సహించు (అడుగులపై వ్రాలును)

సు:—(నిజస్వరూపవేషములతో) నేడు నేనెంతయు గృతార్థను. నాపాలిదైవము మఱల మీపాదధూళి సోకించినాఁడు నాకు (అడుగులపై వ్రాలును)-

ప్రి:—(సువ్రతను లేవదీసి, గాంఢాలింగనముజేసి) నీవిట కెట్లు వచ్చితివి? నీపుణ్య చారిత్రమునకు, నీత్యాగమునకు మేఱలేదు- నీకోరినవరమడుగు. జన్మసహస్రములకు నీఋణవిముక్తుని గాలేను.

సు:—సంతతము మీచరణసన్నిధి నుండునటు లనుగ్రహింపుడు-

ప్రి:—(ఒడలెల్ల ఝల్లుమని పులకింప, ముఖము జేగురింప, కృతజ్ఞతానందబాష్పములు వర్షించుచు) ఇది నిజమా, స్వప్నపునరుక్తియా? ఉండు: యశోవంతునితో యుద్ధమొకటి నిజముగదా? యుద్ధమందు అమ్మునదెబ్బతగిలి నే బడిపోవుట రెండవనిజము. ఇవి నిర్వివాదాంశములు.తరువాత నేమైనది?తరువాత సువ్రత-

సన్న్యాసి—సన్న్యాసి మాఱి మఱలసువ్రత (కన్నులు విప్పి, చుట్టును దేఱిపాఱజూచి, సువ్రతను మఱిమఱి పరిశీలించును)

సు:—(స్ఫుటముగా) భవ్యశీలా!

ప్రి:—ప్రియా, నీవు నిజమైనసువ్రతవేనా? నేనిపుడు బ్రతికియున్నానా?

సు:—సంశయమేల?

ప్రి:—ఇంతమహాభ్యుదయపరంపర నేనెట్లునమ్మను? నేనును యశోవంతుడును కలియ బడుట నిజమేనా?

సు:—మీరు క్రూరశస్త్రాహతిచే సొమ్మసిల్లి స్పృహతప్పుట నిజము.

ప్రి:—నీవు నన్ను బ్రతికించుట నిజమేనా? నాదోషము లెట్లు సైరించితివి?

సు:—ఈమూలిక మీ రెఱుంగనిది కాదు. వింధ్యసీమయందు మనమిర్వురము దీని నెంద ఱకో ప్రయోగించినాము. నాడు మీయాటసింగపుగోదమను కిరాతబాలు డొక్కడెఱుంగక వాడి యమ్ము నేసినపుడు మీరు ఎక్కుటమైన వ్యథనొంది నారు. నేను దీనిమాహాత్మ్యముచే నాకనికరంపుబసిజంతువును పునర్జన్మ మెత్తించి నాను. అప్పటునే దీనిసామర్థ్యము తొలుదొల్త మీకుదెలియుట.

ప్రి:—ఔను, మఱి యొకమాఱు మేఘమేఖలదరినున్న యరణ్యమందు వేటాడుచుమృగ మనుకొని కిరాత బాలు నొకని నేగొట్టినప్పుడు-ఆహాహా! యేమిదీనిమాహాత్మ్యము! కానియీయాతరుణమందు నీకన్నమహత్తరమైనవస్తువు నాకగపడలేదు- నిన్దలచిన మాత్రాన పాపములు భస్మీభూతము లయిపోవును-

ప్రేయసీ! భాగ్యేశ్వరీ! శుభాంగీ!
ప్రణయసుధార్ణవా! పరమార్థకోశ!
చెల్లును నీకె దాక్షిణ్యశీలంబు!
సృష్టికి జననియు జేర్పునై వెలసి
లొల్కికి ప్రియకష్టమైనట్టి త్యాగ
సురమహీరుహమైన సుదతీకులంపు
ఫలమగు నీభవ్యపావనాచార
సామర్థ్యమున భూమి సస్యాఢ్య యయ్యె
నతిశితవ్రత సువ్రతా క్షమానిరత!
నీవిమలోదారభావభాసమ్ము
నిఖిలవిశ్వము గల్పు నిస్సీమముగను,

భవమునిన్నుండి శోభవనశాలి యయ్యె.
పుడమికి సారంబు పోల్పారె నీదు
పరమకల్యాణస్వభావసంపత్తి.
నినుసకు దేజంబు నెరువిచ్చె నీదు
సాత్వికతేజంబు సాధ్వీమతల్లి.
తారాగ్రహంబులతానకం బయ్యె
నీశాంతి నీధర్మనిరతి నీనెవరు.
పటుమంత్రతీర్థసంస్పర్శచే దివ్య
చక్షువు గల్గి ప్రత్యక్ష్యమ్ముగాను
పుణ్యలోకరహస్యముల జూచి చొక్క
కరణి నీశీలంబు గన్నార గాంచి
మరగితి నయమాత్మ మస ల్ల వదిలె.
కటకట జన్మాన గడతేరె సగము
తెలియని న్నేండ్లును దేహాభిమాన
మాత్మశిక్షకు భంగమన్న భావంబు.
అతిలోకసామర్థ్య మమరియున్నపుడు
ప్రాకృతులకు గల్గుఫల మొందనైతి.
అఖిలమర్త్యము నమర్త్యము జేయగల్గి
యప్రతిష్ఠనె యమర్త్యము జేసికొంటి.
అవనికి దివికి వియ్యముగూర్పగల్గు
నుద్దామతేజంబు నుడిపుచ్చిపుచ్చి
యడిదము జేకొన్న యపవృత్తునట్లు
స్వార్థలోకార్థముల్ చక్కాడుకొంటి.
ఇలనెల్ల నిర్జింప నీ, విశ్వమెల్ల
వెఱగొల్పనే, మేటివేల్పుటంతులకు
వరములనొసగనీపరదైవమట్లు,
ఎన్ని సెప్పినజెప్పు మేనాటి కైన
పుణ్యమొల్లని చెల్వపురిలేనిపడగ
నీతికిగాని పొందితి బొమ్మునమ్ము.

(కన్నులు మూసుకొని యొగర్చుచు వలవలయేడ్చును)

—భవ్యశీలా! మీకీవిచారము తగదు. ఓటమికై జన్మింపలేదు మీరు. ఇంకను చాలకాలము గలదు. మీకియ్యెడ గల్గిన శుభసంకల్పము భావిఫలోదయచిహ్నము. లోకోద్ధారమునకై యవతరించిన మీకు రాబోవునదియెల్లను శుభమే కాగలదు.

ప్రి:—(కొంత సేపటికి గన్నులు తెఱచి) ఎవరక్కడ?

(దండనాథుడు ప్రవేశించి, సాష్టాంగపడి నివ్వెఱగందినిల్చును)

దళపతీ, నీవు వాయువేగముతో బోయి యతిత్వరితముగా యుద్ధమునిల్పు.

ద:—(చేతులు జోడించి) స్వామీ, యిప్పుడు తాత్కాలికసంధి ఏర్పడుచునేయున్నది.

ప్రి:—దానినే స్థిరపరుపుము. పాంచాలరాజుల నిరువురను దోస్తు నడిపింపక తత్సంతుష్టికై దక్షిణను బలాత్కరించి యైన గొంపోయి దానిసోదరుల సమ్ముఖాన భర్త కప్పగింపు. పాంచాలమున కేగిన మనసేనల గ్రమ్మఱింపు. నాయీయాజ్ఞ నుల్లంఘించినవాఁడు దేవేంద్రునట్టివీరుడైనను ధర్మబాహునంతటి మాననీయుడైనను నాయస్త్రశస్త్రముల వానిపై బ్రయోగించెద. దక్షిణనంపివేసి శత్రువులు పొలిమేరదాటిన తోడనే నీవు మఱలి వచ్చి నాజనకులయుత్సంగమునకు నన్ను గొనిపో. అంతవఱకు నెవ్వరిని జూడను.

(దండనాథుడు నిష్క్రమించును)

(ప్రియదర్శనుడు లేచి నిలువబడి దండనాథునివైపునం దిరిగి చేయెత్తి పరమోత్కంఠతో దనయాజ్ఞ నిచ్చు నవసరమున తెఱ దింపబడును.)

మంగళం శ్రీ శ్రీ శ్రీ

చెన్నపురి: 'వాణీ' ప్రెస్సున ముద్రితము.—1926.

